# వృషనామ సంవత్సర — వైశాఖ - జ్యేష్ఠమాసములు

1941 మే నెల

| | | |
|---|---|---|
| 1 | గు | పం రా1-21 ఆర్ద్ర తె5-2 మవ12-32ల2-15వ దినం 31-34 ఉదు9-49 మదు2-53 |
| 2 | శు | ష రా1-43 పున పూర్తి సావ5-30 ల 7-10వ ఉదు8-8 మదు12-20 ల |
| 3 | శ | స రా1-30 పున ఉ5-53 మవ2-1 ల 3-39వ ఉదు7-17వ |
| 4 | ఆ | అ రా12-50 పుష్య ఉ6-15 రావ7-6 ల 8-42వ సాదు4-34 ల |
| 5 | సో | న రా11-39 ఆశ్రే ఉ6-13 సావ5-58 ల 7-32వ మదు12-21 తిరి దు2-23ల |
| 6 | మం | ద రా10-8 మఘ ఉ5-42 పుబ్బ తె4-54 మవ1-26ల2-59వ ఉదు8-6 రాదు10-50 |
| 7 | బు | ఏ రా8-18ఉఫరా3-43పవ11-45ల1-16వదినం31-46మత్రతయఏకాదశిపదు11-30 |
| 8 | గు | ద్వా రా6-8 హస్త రా2-15 పవ11-35ల1-5వ ఉదు9-47 మదు2-53ల |
| 9 | శు | త్ర ప3-49 చిత్త రా12.39పవ9-43ల11-13వ త్రయోదశితిధి ఉదు8-6మదు12-21ల |
| 10 | శ | చ మ1-24 స్వా రా10-53 ఉవ5-51ల7-20వ తెవ4-15ల తిథిద్వయం ఉదు7-14వ |
| 11 | ఆ | ○ పూ ప10-56విశా రా9-18ఉ శేవ5-40వరావ1-5ల2-35వపాడ్యమితిథిసాదు4-36 |
| 12 | సో | బపా ఉ8-33 అనూ రా7-44 రావ1-3ల2-33వ పదు12-21 తిరి దు2-54 |
| 13 | మం | వి ఉ6-15 తది తె4-4 రావ1-39ల3-11వ దినం 31-57 ఉదు8-4 రాదు10-50 |
| 14 | బు | చ రా2-19మూసా5-11సావ3-39ల5-12వ వృషభసంక్రమణము ప10-3పదు11-29 |
| 15 | గు | పం రా12-50 పూషా సా4-21 రావ12-15 ల 1-49వ ఉదు9-47 మదు2-54ల |
| 16 | శు | ష రా11-50 ఉషా మ3-54 రావ7-58 ల 9-34వ ఉదు8-4 మదు12-20ల |
| 17 | శ | స రా11-14 శ్రవ 3.54 రావ8-2 ల 9-40వ ఉదు7-13వ |
| 18 | ఆ | అ రా11-13 ధని మ4-23 రావ11-55 ల 1-35వ సాదు4-38ల |
| 19 | సో | న రా11-32 శత సా5-19 రావ12-10ల1-52వ దినం 32-7 పదు12-22 మదు2-56ల |
| 20 | మం | ద రా12-32 పూభా రా6-49 రావ5-14ల ఉదు8-3ల రాదు10 51 |
| 21 | బు | ఏ రా1-55 ఉభా రా8-42 ఉ శేవ6-54వ మత్రయ ఏకాదశి పదు11-30 |
| 22 | గు | ద్వా రా3-44 రేవ రా11-2 పవ9-51ల11-36వ ఉదు9-47 మదు2-56 |
| 23 | శు | త్ర పూర్తి అశ్వ రా1-30 రావ9-7 ల 10-53వ ఉదు8-4 మదు12-22 |
| 24 | శ | త్ర ఉ5-40 భర తె4-10 మవ12-10 ల 1-57వ మాసశివరాత్రి ఉదు7-11వ |
| 25 | ఆ | చ ఉ7-43 కృ పూర్తి సావ5-28ల7-14వ దినం 32-16 అమావాస్య సాదు4-39 |
| 26 | సో | ● అమా ఉ9-39 కృ ఉ6-42 రావ12-18ల2-3వ పదు12-21 మదు2-56 |
| 27 | మం | శుపా ప11-19 రోహి ఉ9-1 మవ3-5 ల 4-49వ ఉదు8-3 రాదు10-52 |
| 28 | బు | వి మ12-37 మృ ప11-0 రావ7-58 ల 9-40వ తదియతిధి పదు11-30 |
| 29 | గు | త మ1-27 ఆర్ద్ర ప12-30 రావ1-3 ల 2-43వ చవితితిధి ఉదు9-47 మదు2-57 |
| 30 | శు | చ మ1-45 పున మ1-31 రావ9-45 ల 11-23వ పంచమితిధి ఉదు8-2 మదు12-21 |
| 31 | శ | పం మ1-35 పుష్య మ2-3 రావ2-55ల4-31వ దినం 32-23 షష్ఠితిధి ఉదు7-11వ |

## ముఖ్య పండుగలు

1. శంకరజయంతి. 5. వైష్ణవ శ్రీరామనవమి. 9. స్మార్తమాధ్వ శ్రీ నృసింహజయంతి.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము: దివాస్వప్నమా?




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# "ఇల్లాలు"కు సన్మానము

భారతదేశములో మరల ఈనాడు ఆర్య సంప్రదాయముగ నారీగౌరవము హెచ్చుచున్నందుకును, స్త్రీని పురుషునితో సమానముగ జూచుదృష్టి యేర్పడుటయే గాక, స్త్రీని ఉత్తమవ్యక్తిగాను మాతృమూర్తిగాను దర్శించి సమాదరణ చేయుటకు తగు జాగరణమును సభ్యతయు అలవడుచున్నందుకును ఎంతయు సంతోషపడవలసిన దినములు వచ్చుచున్నవని తోచును.

స్త్రీనీ, స్త్రీకి సంబంధించిన లలితకళలనూ, సంగీత సాహిత్యనృత్యగీత నటనాదులనూ పునరుద్ధరించే ప్రయత్నములు నేడు భారతదేశమంతటితోపాటు, ఆంధ్రదేశమున కూడ విశేషముగ జరిగే ప్రయత్నములూ, ప్రోత్సాహ మీయబడే సూచనలూ గోచరించుచుండుటయు ముదావహము.

హిందీ సినీమాప్రపంచములోను సంసారస్త్రీలు పాల్గొనుటయు, భారతీయ నారీగౌరవమునకు తోడ్పడే ఫిలుములు తయారగుచుండుటయు, సంగీత నాట్య ఖేలనములకు విశేషావకాశములిచ్చు చిత్రములు జయప్రదముగ ప్రదర్శింపబడుటయు ప్రేక్షకుల కళోన్ముఖతను దర్శకుల ఆశయములను వెల్లడిచేయును.

ఆంధ్రదేశములో వెనుకటి సంవత్సరములలో పౌరాణిక చిత్రములు హెచ్చుగా తయారగుచుండినవి. వాటియందు ప్రజలకు మోజు తగ్గిపోయినది. నేడు సాంఘిక చిత్రములందే ప్రజలకు శ్రద్ధా అదరణా యున్నవి.

అందులోనూ, స్త్రీకి ప్రాధాన్యమిచ్చిన కథలయందు, స్త్రీయొక్క పాతివ్రత్య సతీత్వ మహిమలను ప్రశంసించి ప్రదర్శించు సాంసారిక చిత్రములయందు ఆంధ్రప్రజకు సహజమైన ఆదరణాతిశయమున్నదని ఋజువగుచున్నది.

1940 సంవత్సర ప్రాంతంలో ఆంధ్రులచే తయారుచేయబడిన తెనుగు టాకీలలోకెల్ల ఉత్తమమగు అభిమానచిత్రము "ఇల్లాలు" అనే నిర్ణయము ఆంధ్రపత్రికవారేర్పాటుచేసిన ఫిలింబాలెట్ (వోట్ల ఎన్నిక)వల్ల ప్రకటితమైనది.

ఫిలిం పరిశ్రమ దృష్టితోనో, ఫిలిం టెక్నిక్ దృష్టితోనో, ఉత్తమ నటనావైఖరి ప్రమాణముతోనో, ఆదర్శప్రాయమైన చిత్రాలు ఉండవలసినతీరు గూర్చిన విమర్శతోనో గాక, ఈ సందర్భంలో, మా దృక్పథం ఏమంటే:—

ఆంధ్రులు సాంఘిక చిత్రాలనే అత్యంతాధికముగా అభిమానించుచున్నారనీ, అందులోనూ స్త్రీలను ఉత్తమ యిల్లాళ్లుగా, ఆదర్శ గృహిణులుగా, మాతృస్థాన మలంకరించవలసిన ప్రేమమూర్తులుగా, అహింస, త్యాగము, సేవ, సుహృద్భావము, దైవీశక్తుల ప్రదర్శించగల మహత్వము గలవారినిగా చిత్రించుటనే ఇతోధికముగా ఆంధ్ర సినీమా అభిమానులు ప్రశంసించు చున్నారనే Sentiment కే యీ ఫిలిం బాలెట్ (Index) సూచికయని మా దృష్టికి తోచుచున్నది.

పాశ్చాత్య నాగరికతతీరునగాక, ఆర్య సంప్రదాయమునకు చెందిన ఆర్యనారీగౌరవము, మాతృపూజ నిజముగా, సహజముగా, హృదయపూర్వకముగా, ఆంధ్ర జనులకు అలవడిననాడే స్త్రీలు ఉచిత అర్హాస్థానమునకు రాగలరని "గృహలక్ష్మి" యభిప్రాయము.

---

స్త్రీ స్వాతంత్ర్య మెట్టిది? కులకాంతలు సినీమాలలో చేరుట ఉచితమా?
ఏది పాతివ్రత్యము? వరకట్నములు స్త్రీలకు లాభమా?

ఇత్యాది విషయములను గురించి స్త్రీలు జబాబులు క్లుప్తముగా వ్రాయుటవలన "గృహలక్ష్మి" ద్వారా స్త్రీ హృదయము వెల్లడియగుటేకాక స్త్రీల రచనాశక్తి కూడ పెంపొందును. ఇట్టి వ్యాసరచనలకు సోదరీమణులు ముందంజ వేయుదురా?

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

● వైశాఖమాసము ●

**అశ్విని**

అధికారము; బంధనము; జ్ఞానవిచారణ

**భరణి**

కార్యవిఘ్నం; స్థానచలనం; నల్లవస్తు వ్యాపారములో అభివృద్ధి

**కృత్తిక**

కోర్టు వ్యవహారం; భూలాభం; స్త్రీ సౌఖ్యం

**రోహిణి**

సద్గోష్ఠి; విద్యాభివృద్ధి; రాజవిరోధం;

**మృగశిర**

గురుభక్తి; బ్రాహ్మణమూలమున ధనాగమనం; సంచారం

**ఆర్ద్ర**

తల్లికి సౌఖ్యం; ఆరోగ్యం; శుభవార్త

**పునర్వసు**

సుగంధవస్తువులలో లాభం; గౌరవం; ఖ్యాతి

**పుష్యమి**

శిరోవ్యాధి; రక్తవిరేచనము; ప్రభుదర్శనం

**ఆశ్లేష**

ధననష్టము; కృషిహాని; ప్రయాణములో కీడు

**మఖ**

వ్యయం; పుత్రులచే ఆందోళన; వ్యాకులత

**పుబ్బ**

క్రొత్త స్నేహమువలన శుభం; నాభిశూల; కలహం

**ఉత్తర**

పంటినొప్పి; రాజభయం; వ్యాపారములో నష్టం

**హస్త**

బంధుసమాగమం; నూత్నాభరణం; సుఖం

**చిత్త**

మిత్రులవలన లాభం; శరీరారోగ్యం; కీర్తి

**స్వాతి**

సంతోషం; విదేశవాసం; కార్యసాధనం

**విశాఖ**

భోగం; ఉద్యోగవృద్ధి; ఇష్టార్థలాభం

**అనూరాధ**

ప్రయాణములో శుభం; గృహచ్ఛిద్రం; ధైర్యం

**జ్యేష్ఠ**

ఉష్ణజ్వరం; స్థానచలనం; రాచకార్య విరోధం

**మూల**

భయం; ధాన్యనాశం; శత్రువృద్ధి

**పూర్వాషాఢ**

లోహములలో లాభం; నీచసేవ; ప్రభు దర్శనముచే కార్యసిద్ధి

**ఉత్తరాషాఢ**

మనోవిచారం; అర్థలాభం; జ్ఞాతివైరం

**శ్రవణం**

యుద్ధభయం; స్త్రీ మూలమున కలహం; క్రోధం

**ధనిష్ఠ**

తైలవ్యాపారవృద్ధి; గృహనిర్మాణం; పీడ

**శతభిషం**

నేత్రవ్యాధి; కృషిభంగం; పుత్రవృద్ధి

**పూర్వాభాద్ర**

వివాహకార్యం; రాజదర్శనం; సంతోషం

**ఉత్తరాభాద్ర**

సాహసముచే ధనలాభం; ఉత్సాహం; జయం

**రేవతి**

భూవిక్రయం; ధాన్యలాభం; బంధుసమాగమం

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

## కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

(గతసంచిక తరువాయి)



బొటనవ్రేలి మొదటి కనుపునందు చేరువగా అడ్డరేఖలుండిన మహదైశ్వర్యము.

బొటనవ్రేలి రెండవ కనుపునందు నక్షత్రగురుతు ఒకటి యుండిన గొప్పభాగ్యమును సూచించును.

ఇది పర్వమునకు చేరువనే యుండిన అన్యపురుషులచే మనోవిచారము గలుగుట సూచించును.

దీనియందు రెండు నక్షత్రగురుతులుండిన శాంతస్వభావము, ఇతరులు చూచి సంతోషపడునట్టి గుణములుండుటను దెలుపును.

ఈ బొటనవ్రేలు సన్నముగ నున్న సద్భావము గలిగి నాగరికులై యుందురు. ఇది మధ్య సన్నగిలి ఇరువైపులా లావుగనున్న సూక్ష్మజ్ఞానము, మంచి గ్రహణశక్తి: వీటిని సూచించును.

### గోళ్లు

కులుచగోళ్లు పట్టుదల, జిజ్ఞాస, చురుకుదనము, విమర్శజ్ఞానము వీటిని దెల్పును.

ఇట్టి గోళ్లు దుర్లక్షణ హస్తమునందున్న మూర్ఖపు పట్టుదల, కోపము, కుతర్కము, పరుల దోషము లెంచుచు తమ తప్పులను సమర్థించుకొనుట వీటిని సూచించును.

కురుచుగోళ్లు మెత్తని హస్తమునందున్న చతురత, వ్యాఖ్యాన నైపుణ్యము, హాస్యరసముతో గూడిన భాషణమును గలిగి సకల జనానురంజకులై యుందురు.

మరియును కురుచగోళ్లు కఠినములై మాంసములోనికి యణగియున్న కలహస్వభావము, చులుకు దనము, ఉద్రేకము, ప్రతికార్యమునందును ముందంజవేయుటను సూచించును.

వెడల్పుగలిగి చదరముగానుండు గోళ్లు బలమును సూచించును. దీనిని గలవారు కామక్రోధములకు లోనై మూర్ఖులై యుందురు.

చివర వెడల్పుగలిగి వ్రేలిచుట్టును వంపుగల్గి, గులాబిరంగుతో, మిగుల నునుపుగలిగి యుండు గోళ్లు నిష్కాపట్యమును, మోసములేని గుణమును సూచించును.

అడుగున వంపులేని చదరపుగోరు ముంగోపమును దెలుపును. అడుగున వంపుగలిగి పెద్దదిగానుండు గోరు వ్యాపారవిషయమునందు ఓపికయు, జాగ్రత్తగలిగియుండుటను దెలుపును.

బాదామిగింజవలె నుండు గోరు మంచి స్వభావమును దెల్పును.

గులాబీ రంగు గల గోరు యతి రోషముగల స్వభావమును దెల్పును.

తెల్లనిరంగు గోరు పశ్చాత్తాపములేని స్వభావమును తెలుపును.

వెడల్పులేక నిడివిగానుండు గోరు భయపడు స్వభావమును, కార్యములందు వెనుదీయు గుణమును సూచించును.

నిడివియై కుష్కించి నడుమ ఉబికి అడుగున తెల్లగ చంద్రరేఖవలె నుండు గోరు మంచి నడతను, శాంతస్వభావమును దెల్పును.

అడుగున వంపుగల్గి, చంద్రరేఖతోనున్న నిడివిగోరు సూక్ష్మతను, విశాలబుద్ధిని సూచించును.

కొలువుటచే కురుచగానుండు గోరు రోషగుణమును, భయపడు స్వభావమును, ఇతరులకు శ్రమను గలిగించు గుణమును తెలుపును.

చక్రాకృతిగానుండు గోరు అంతలో కోపం, అంతలో శాంతము వహించు స్వభావమును దెలుపును.

# భారత మహిళామండలి, బెజవాడ

## 13వ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము

### శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

సోదర సోదరీమణులారా !

"భగవానుని కృపావిశేషంచేత నేడు మిమ్ములను కలుసుకొనే భాగ్యం కలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను.

జనవరినెలనే యీ వార్షికోత్సవం జరుగవలసివుండెను. అట్లాగే జరిగివుండినట్లైతే నాకు మీ సాహచర్యభాగ్యం కలిగేదేకాదు. అప్పుడు నాకు కల్గిన యిబ్బందులు తెలియబడకుండానే అప్రయత్నంగా యీ వార్షికోత్సవం వాయిదాపడటమూ రెండు మాసములకు తర్వాత నేను నాకుగల్గిన వ్యాధుల నుండి విముక్తనై మీ సన్నిధికి రావడమూ కేవలం భగవంతుని వాత్సల్య విశేషమనిగాక మరేమని చెప్పగలము? భగవంతునకు నా ధన్యవాదాలు. సోదరి శ్రీమతి రాజరాజేశ్వరమ్మగారికి నాపైగల ప్రేమ అపారం. 1929 సంవత్సరంలో ఈ పురంలో ఆంధ్రమహాసభతోపాటు ఆంధ్రమహిళాసభ జరిగినపుడు నన్ను ప్రయత్నపూర్వకంగా తొలిసారి వుపన్యాసవేదిక నెక్కించి సభలలో ఉపన్యసించు అభ్యాసానికి విఘ్నేశ్వర పూజచేయించిరి. నేడు ఆ ప్రేమభరిత హృదయంతోనే తమ కార్యనిర్వాహక వర్గమువారితోగూడి యీ ఆధిపత్యమునకు అవకాశం గలిగించిరి. కాని యీ సమ్మానమునందుకోడంలో నాకు మాత్రం జంకుగానే వున్నది. యీ ఆధిపత్యానికి సాధారణంగా ఆంగ్ల విద్యాధికులైనవారు, ఉన్నతోన్నత పదవుల నధిష్ఠించినవారు మాత్రమే వస్తూవున్నట్లు వినికిడి. అటువంటి సందర్భంలో నావంటి సామాన్యురాలు మిమ్ముల నేమాత్రము సంతుష్టిపరచగలదనేదే నా సందేహము. అయినా యే వాత్సల్య పూర్వకమైన ఆదరంతో నన్ను ఆహ్వానించారో ఆ ప్రేమాకలిత హృదయంతోనే నా అసమర్ధతను సహింపగలరనే నమ్మకంతో సమ్మతించితిని. తప్పులుంటే క్షమించాలె.

మన తెలుగుసీమలో స్త్రీ సమాజాలు ఉద్భవించి దాదాపు ముప్పదిసంవత్సరాలైనది. అయినా స్త్రీ సమాజాలు యిప్పటికీ పొందవలసినంత అభివృద్ధిని పొందలేదని చెప్పడానికి విచారం కలుగుతున్నది. వింతలలోవింత ఏమిటంటే ఎవరి నిమిత్తమై యే సంఘాభివృద్ధి నిమిత్తమై యీ సమాజాలు పుట్టినాయో ఆ స్త్రీలకు యివంటే బెరుకూ, ఆక్షేపణ పోలేదు. కంచెయే చేనుమేసినట్లుగా స్త్రీలే వీటిపై నిందాత్మకమైన మాటలు విసురుతూ వుంటారు. నిరుత్సాహకరమైన పలుకులు పలుకుతూ వుంటారు. కేవలం కాషాయ వస్త్రమే కట్టుబట్టగా కట్టుకొని గురుశుశ్రూషయే లక్ష్యంగా పెట్టుకొని భగవదారాధనయే పరమార్థంగా బెట్టుకొని, కాలంగడిపే భక్తిపరురాండ్రూ, ఇల్లు వెడలకపోవడమే సాధ్వీధర్మంగా బెట్టుకొన్న యిల్లాండ్రూ సినిమాలుమీదన్నా ఆంక్ష తొలగించారుగాని స్త్రీ సమాజాలమీద మాత్రం నిషేధం తొలగించలేదు. స్త్రీ సమాజాలమీద స్త్రీలకే యింత శీతకన్నెందుకు? ఎచ్చటికీ పోనివారు యిచ్చటికీరారు సరే. కాని పురాణాలకూ, హరికథలకూ, నామ సప్తాహాలకూ, గురూపదేశాలకూ, నిరాక్షేపణగా తండోపతండాలుగా వెళ్లే

వారుగూడా వీటి కెందుకురారు? అక్కడ పురాణాలు, పుణ్యకథలుచెప్పే పురుషులు స్త్రీలనెంత ఆక్షేపిస్తున్నా, ఎక్కడబట్టినా యీ ఆడమూకతో చచ్చిపోతున్నామని యెంత విసుక్కుంటున్నా, ఈ ఆడవారంతా అక్కడే మూగడమెందుకు? దీనికి ప్రబలమైనకారణం వకటి కనుపిస్తున్నది. మనలో అంతులేని పుణ్యాపేక్ష ఒకటి జీర్ణించి శల్యగతమై ఉన్నది. అది అటువంటి పురాణ కాలక్షేపాది ప్రదేశములకు పోతేనే లభ్యమౌతుందనే తలంపొకటి ఉన్నది. అక్కడికి పోయి సంపాదించిన పుణ్యం మనల నెక్కడికో అనన్య దుర్లభమైన స్వర్గసీమలకు కొనిపోతుందనే భ్రమ వకటివున్నది. అటువంటి అమూల్యపదవిని అందించే సత్తా స్త్రీ సమాజాలకు లేదనే అపోహ వకటి వున్నది. పైగా అటువంటి కాలక్షేపాలకు పోవడము సదాచారము. సత్సాంప్రదాయము. సనాతనధర్మము. ఇది నవీనమార్గము. ఆక్షేపణీయాంశము. స్త్రీ ధర్మ విరుద్ధము. అది ముముక్షుపథము. ఇది ఐహికలంపటత్వము. ఎప్పటికైనా అది ముక్తినిస్తుందిగాని యిది కాదు, అనే నిశ్చితాభిప్రాయ మొకటి స్త్రీలల్లో పాదుకుపోయింది. స్త్రీలు పుణ్యపిపాస యింతగా కల్గియుండటము గొప్పమాటే. అయినప్పటికి ఆ పుణ్యార్జనకు మార్గమింత సంకుచితముగా వుండటముమాత్రం ఒప్పుకోవలసిన మాటగాదు. ఒట్టొట్టి ఉరుకులవల్లనే పుణ్యం అరచేతి నిమ్మపండవుతుందని యెవరుగాని భావించడం పొరపాటు. అజ్ఞానం. మోక్షం వూరికేరాదు. అనంతమైన మనస్సంస్కారం ఉండాలె. అసమానమైన స్వార్థత్యాగం వుండాలె. అసదృశమైన నిర్లిప్తభావముండాలె. మోక్షమంటే సంసార జంఝాటంలో ఉండీ నిరపేక్షులై లోకోపకారమైన సేవాధర్మంతో పారమార్థిక జీవితాన్ని గడపడమేగాని యెక్కడో చచ్చి స్వర్గసీమలలో ఊహకందని సుఖానుభవం పొందుతా మనుకోడంగాదు. సత్యము, శీలము స్వార్థత్యాగము ఉంటే యే మార్గములోనూ పుణ్యమే సంపాదించవచ్చు. సేవయొక్క పరమార్థం తెలుసుకొని తమజీవితాన్ని పరార్థసేవకు అంకితం చేసుకున్నట్లయితే పుణ్యంకొరకూ, మోక్షంకొరకూ ప్రత్యేక ప్రయత్నం అక్కరలేదు.

ఏమనిషిగాని తనమట్టుకు తాను సుఖంగా ఉంటేచాలు ననుకోడం స్వార్థం అనిపించుకుంటుందిగాని తన జాతియొక్క తన సంఘంయొక్క మేలుచూడడం స్వార్థం అనుపించుకోదు. పైగా విధాయకధర్మం కూడా అయివున్నది. ఒక్కమాట. మీ మనస్సులో, మనం యేదేశంలో పుట్టాము? యే సంఘంలో పుట్టాము? ఏజాతికి చెందియున్నాము. మన మంచిచెడ్డలేమిటి? యావత్ప్రపంచంలోనూ స్త్రీలు వున్నారు గదా వారంతా ఎట్లావున్నారు? మన మెట్లాయున్నాము? అని ప్రశ్నించుకొన్నట్లైతే కొంతైనా మీ పరిస్థితి అవగాహన అవుతుంది. మన మూకీభావం అనర్థదాయకమనీ, మనం యెండమావులవెంట పరిభ్రమిస్తున్నామని తెలిసిపోతుంది. తెలుసుకున్న తర్వాత ఊహించండి. యుగయుగాలుగా వెంటాడివస్తూన్న యీ అజ్ఞానం, యీ బానిసతనం, ఈ ఆర్థికదారిద్ర్యం ఎట్లా నివారణ అవుతాయి అనిపిస్తుందో లేదో! అనిపించగానే మార్గమేమిటని వెంటనే వెతుక్కుంటాము. కలి యుగంలో సంఘశక్తి బలవత్తరమైందని పెద్దలు చెప్పేఉన్నారు. సంఘశక్తిద్వారానే మనంకూడా మన పనులు సాధించుకోవాలె. సంఘాలంటే యేమిటి? సమాజాలే. స్త్రీలకేవిధమైన హక్కులు, అధికారములు, బాధ్యతలు, కావాలెనన్నా అవి స్త్రీ సమాజాల ద్వారానే పొందాలె. స్త్రీ సమస్యలను పరిష్కరించడానికి స్త్రీ సమాజాలొక్కటే చాలివున్నవి. స్త్రీ సమాజము లంటే స్త్రీ జన కల్పకాలు.

మనదేశంలో ఉన్న స్త్రీ సమాజాలే చాలాకొద్ది. ఆ వున్నవైనా అన్నీ ఒక ముఖంగాలేవు. కొన్ని చిరతలు తాళాలు ముందు బెట్టుకొని భక్తసమాజాలుగా పరిగణింపబడుతున్నవి. కొన్ని పత్రికలు, పుస్తకాలు పెట్టుకొని విద్యాభివృద్ధిని కోరేవిగా వుంటున్నవి. కొన్ని బ్యాట్లు, బంతులు చేతబట్టుకొని క్రీడాసక్తిని పురిగొల్పేవిగా ఉంటున్నవి. వీనిలో యితర కార్యక్రమములు మరికొన్ని జరుగుతూ వుండవచ్చు, గాని ముఖ్య లక్ష్యా లివిగా కనిపిస్తున్నవి. ఈ లక్ష్యభేదాన్నిబట్టి అభిప్రాయ భేదాలుకూడా యేర్పడి వకరు చేసేది వకరికి అనుచితంగా తోస్తున్నది. భక్తి లక్ష్యం గలవాళ్లు; విద్యాలక్ష్యం గలవాళ్లని చూచి ఏమిటీ అజ్ఞానం - పత్రికలవల్ల, పుస్తకాలవల్ల ఏమివస్తుంది, ముక్తిమార్గం చూచుకోక, అనుకుంటున్నారు.

విద్యాలక్ష్యం గలవాళ్లు, క్రీడాలక్ష్యంగలవాళ్లని చూచి, ఏమిటీ అజ్ఞానం - యీ ఆటపాటలవల్ల యేమివస్తుం దనుకుంటున్నారు. క్రీడాలక్ష్యంగలవారు పైయిరువురినిచూచి భజనలు, పురాణాలు, గ్రంథాలు, పత్రికలు, ఏమిటీ వెర్రి. చదువుకోవాలంటే యింట్లోలేవూ, హాయిగా కాశేపు సరదాగా ఆటపాటలతో కాలక్షేపంచెయ్యక, అనుకుంటున్నారు. ఒకరిది సనాతన పంథా. ఒకరిది దేశవాళీపద్ధతి. ఒకరిది పాశ్చాత్యాను కరణము. మొత్తంమీద చదువే ముఖ్యమనుకునే నావంటి మధ్యరకంవారికి అవస్థగానే వున్నది. భక్త సమాజాలు నడిపేవారు మాకున్న భక్తి ప్రపత్తులు మీకులేవని చిన్నచూపుచూస్తే, పాశ్చాత్య పద్ధతులు ఆచ రించేవారు ఆపాదమస్తకం మమ్ములను పరికించి యీనాటి సరకుతో మసలడం మనకు లాయకీకాదను కుంటు న్నారు. భజనలు చేయలేకపోయినా భగవద్భక్తి మాకూ ఉన్నదర్రా అంటే వాళ్లు నమ్మరు. ఆటలంటే మాకూ రక్తిఉన్నది, నిలిచి వూరికే బంతిఆటలు ఆడలేకపోయినా కూర్చుండి ఆడే (క్యారమ్‌బోర్డు వగైరా) ఆటలు ఆడగలమంటే వీళ్లూ నమ్మరు. ఇవొక్కటేనా? యింకా వీనిలో డబ్బు హోదా, అధికారము, వర్ణమునకు సంబంధించిన తరతమ భేదాలెన్నో కానవస్తున్నాయని లోకంలో వాడుకపడ్డది. సామాన్య స్త్రీలకూ, తెలుగే వచ్చినవాళ్లకూ, హోదాలేమీ లేనివాళ్లకూ లేడీసుక్లబ్బులలో తావులేదని పలువురు చెప్పగా వినడం సంభవిస్తున్నది.

ఈ విధంగా దేశంలో ఉన్న స్త్రీ సమాజాలు పలుపోకలుగా ఉండటంచేత సరియైన సంఘ బలమునూ, ప్రజాదరమునూ పొంది చేయవలసినంత ఉపకారమును చేయలేకుండా ఉన్నవి. నిజమాలోచిస్తే ఒక్కొక్క అభిప్రాయానికి ఒక్కొక్క సమాజం ఉండటం అవసరమా! ప్రతిసమాజమునందునూ పై మూడు శాఖలు ఎందు కుండకూడదు? భగవద్భక్తి యెవరికక్కరలేదు? భగవద్విశ్వాసి కానివారు యే పనినైనా చేయగలుగుతారా? విద్యా విజ్ఞానాలులేని సమాజంవల్ల ప్రయోజనమేమి? వినోద క్రీడాకలాపములు లేని సమాజంలో ఉల్లాసోత్సాహాలకు తావుండునా? వీనికితోడు కళాపరిశ్రమలు చేరకున్న స్త్రీల అర్థోపపత్తికి అవకాశముండునా?

కనుక ప్రతిసమాజము పైశాఖలన్నిటినీ కలిగి, వారివారి అభిరుచులకొద్దీ అన్నిరకముల స్త్రీలను ఆకర్షింప చేయగలిగినట్లైతే, వీని కనుబంధముగా రెడ్‌క్రాసు సొసైటీవలె బీదలగు వ్యాధిగ్రస్తులకు ఉచిత వైద్యము, చూలింతలకు మంత్రసానుల సరఫరా వగైరా సహాయములు చేయగల సేవాశాఖగూడ ఉన్నట్లైతే, స్త్రీ సమాజములు మంచిసేవను చేయగలవు. స్త్రీ సంఘమునకు వీనివలన మహోపకృతి గలుగగలదు.

మరియు ఆంధ్రదేశంలో చెల్లాచెదరుగావున్న స్త్రీ సమాజాలన్నీ ఒక్క కేంద్రసంఘంక్రిందకు తీసుకొనిరాబడి అన్యోన్య సహాయంతో, సలహాలతో పనిచేయడం గూడా చాలా అగత్యం. ఎచ్చటెచ్చట స్త్రీ సమాజాలున్నవో, అవి ఏవిధంగా పనిచేస్తున్నవో, వాటి అభివృద్ధికి చేయవలసిన సహాయమేమిటో, మహిళా సమాజములింకను విరివిగా దేశవ్యాప్తమగుటకు మార్గములేమిటో ఆలోచించుటకు కేంద్రసంఘం ఒక్కటే అర్హత గలిగి వున్నది. స్త్రీ సమాజముల నిర్వహిస్తూ ఉన్నవారూ, స్త్రీ సమాజముల ప్రయోజనమును గుర్తించిన వారూ, స్త్రీ జనాభివృద్ధి నాకాంక్షించేవారూ యీ విషయమై పర్యాలోచించి కేంద్ర సంఘమును స్థాపించుటకు పూనుకొందురని భావిస్తున్నాను.

స్త్రీసంఘ మిప్పుడు మునుపటివలె మైనరుసంఘం కాదు. పరపోషణ, పరసహాయ్యం దీనికిప్పుడు లేదు. భారత ప్రజాసంఖ్యలో అత్యాధిక సంఖ్యగలిగి అనేక స్త్రీసమస్యలను స్వయంగా పరిష్కరించుకొనవలసిన బాధ్యతను కలిగి ఉన్నది. కనుక ధనవంతులగు స్త్రీలు అధికంగా ధనసహాయం చేయాలె. విద్యావతులైన స్త్రీలు తమ మేధాశక్తిని బాగుగా వినియోగించాలే. సేవాపరాయణులగు స్త్రీలెందరో కష్టపడి పని చేయాలె. అప్పుడుగాని భారతమహిళలు సర్వతోముఖాభివృద్ధిజెంది సభ్యదేశతాగౌరవము నందజాలరు.

ప్రస్తుతము ప్రపంచపరిస్థితులు మనదేశపరిస్థితులు గూడా సవ్యముగాలేవు. ప్రపంచంలో యేమూలనున్నా స్త్రీ లందఱూ ఒకటే. ఐరోపాఖండమునందలి స్త్రీలు భయంకర సంగ్రామములో జిక్కుకొని కన్న బిడ్డలను ఏ కానిదేశాలకో దాచిపెట్టడానికి పంపి, ప్రియభర్తలను యుద్ధమునకు పంపి, తాము భయంకరాగ్నేయ గోళములమధ్య క్షణ క్షణ గండంతో అన్ని పరిపాలనా శాఖలలోను తామేయై దేశకార్యములు నడుపుతూ గాసిబడుతున్నారు.

మనదేశంలో అటువంటి ఆయుధయుద్ధం జరుగకపోయినా శాంతి సంగ్రామం జరుగుతూనే యున్నది. వేలకొలది సోదర సోదరీమణులు జైళ్లలో గ్రమ్గుతున్నారు. వెలుపలవున్నవారు గూడా యుద్ధమువల్ల నేర్పడిన ఆర్థికదుస్థితికి లోనై కటకట బడుతున్నారు. ఈ సందర్భమున నిర్మాణకార్యక్రమ మొకటి మహాత్మునిచే సూచితమై ఆర్థికోపద్రవమును తొలగింప యత్నించుచున్నది. నూలువడకుట అనాదిసిద్ధమైన గృహపరిశ్రమయేగాని క్రొత్తవిషయంగాదు. కావున స్త్రీలెల్లరు నూలువడకుట మూలమునను తదితర గృహపరిశ్రమలను నిర్వహించుట మూలమునను దేశదారిద్ర్యమును నివారించుటకు పూనుకొనవలెను. ఇంతే కాదు. నాగరికత కొఱకూ, విలాసంకొరకూ, సౌందర్యపోషణకొరకూ, గొప్పతనపు వైభవంకొరకూ, విదేశ వస్తువులను వాడటంకూడా మానివేయాలె. దేశీయపరిశ్రమలను త్రికరణశుద్ధిగా పోషించాలె. మాతృదేశ ఋణం తీర్చుకోడానికి ప్రతిఒక్కరూ ప్రయత్నించాలె.

ఈ బెజవాడపురమున నెలకొనియున్న భారతమహిళామండలి మంచి అభివృద్ధిలో ఉండి చక్కని భవనారామాది వసతులను గలిగి యుండటము యీ పురస్త్రీల అదృష్టమనియే చెప్పవలెను. సమస్త లక్షణములు కలిగి పక్వ ఫలమువలెనున్న యీ మహిళామండలిని పురస్త్రీలెల్లరు చక్కగా వినియోగించుకొని తగిన ప్రయోజన మందవలెనని నా కోరిక. నాకీ అవకాశము కలుగజేసిన భారత మహిళామండలివారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు చెల్లిస్తూ నా ఉపన్యాసం ముగిస్తున్నాను.”

# ★ రా జ మ కు టం

రచయిత :
శ్రీ గోవింద వల్లభపంతు

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

——————ముందు కథ——————

మేవాడ్ రాజ్యానికి వనవీరుడు పట్టాభిషిక్తుడయాడు. పన్నా ఉదయుని వెతుక్కుంటూ వచ్చి తాంత్రికుల గురువు బహదూర్ సింగును కలుసుకొంటుంది. ఉదయుడు, పన్నా, బహదూర్ సింగు ముగ్గురూ, కమల్ మీరు వెళ్ళడానికి ప్రయాణమవుతారు.

## పాత్రలు

| | | |
|---|---|---|
| 1. ఆశాశాహుడు | ... | కమల్ మీరు ప్రభువు |
| 2. మంత్రి | ... | |
| 3. పన్నా | ... | ఉదయుని దాది |
| 4. బహదూర్ సింగు | ... | తాంత్రికుల గురువు |
| 5. రాజమాత | ... | ఆశాశాహుని తల్లి |
| 6. ఉదయసింహుడు | ... | విక్రముని తమ్ముడు |
| 7. వనవీరుడు | ... | శీతలసేని పుత్రుడు |
| 8. ఛందావత్ | ... | ఒక సర్దారు |
| 9. శీతలసేని | ... | వనవీరుని తల్లి |
| 10. రణజిత్తు | ... | ఒక లోభి సర్దారు |
| 11. ద్వారపాలకుడు | ... | |

——————ఇక చదవండి——————

# తృతీయాంకము

## దృశ్యము ౧.

[కమల్ మీరు దర్బారు. కమల్ మీరు ప్రభువు మంత్రితో ప్రసంగించుతూంటాడు. ఇంతలో ద్వారపాలకుడు ప్రవేశిస్తాడు.]

ద్వారపాలకుడు :-(ప్రణామంచేసి) జయము కమల్ మీరు ప్రభువులకు! ఎవరో దీనురాలు - ఒక కుర్రవాణ్ణీ, ఒక ముసలాతణ్ణీ వెంటబెట్టుకొని ద్వారం ముందు వేచియున్నది, తమ దర్శనంకోసం, తన దుఃఖకథ దేవరవారికి మనవిచేసుకునేందుకు. ఆజ్ఞ అయితే ప్రవేశపెడతాను.

ఆశాశాహుడు :-దుఃఖితులకు నా ద్వారం ఎప్పుడూ తెరచేఉంటుంది. ప్రహరీ! ఆమెను ప్రవేశపెట్టు. (ద్వారపాలకుడు నిష్క్రమిస్తాడు. ఆశాశాహుడు మళ్లీ మంత్రితో ప్రసంగిస్తూంటాడు. పన్నా, బహదూర్ సింగు, ఉదయుడు ప్రవేశిస్తారు.)

ముగ్గురు :-జయము కమల్ మీర్ ప్రభువుకు!

ఆశాశాహుడు :-ఎవరూ? నువ్వు ఇలా రావటానికి కారణం?

పన్నా :-అంతా మనవిచేస్తాను. కాని—(మంత్రికేసి చూస్తూ చెప్పటానికి సంకోచిస్తుంది.)

ఆశాశాహుడు :-(పన్నా అభిప్రాయం గ్రహించి మంత్రితో) మనం మళ్లీ కలుసుకుందాం. ప్రస్తుతం ఈమె విషయమేమిటో వినాలని ఉంది.

మంత్రి :-చిత్తం! (అభివాదంచేసి నిష్క్రమిస్తాడు.)

ఆశాశాహుడు :-మంచిది; ఇక చెప్పు, నీకేం కావాలి?

పన్నా :-శరణు ప్రభూ! సమస్త మేవాడ్ ప్రదేశంలో నేడు మేవాడాధిపతికే, ఇంత నిలువనీడలేకుండా ఉంది. (బహదూర్‌సింగు కొంచెము చకితుడౌతాడు.)

ఆశాశాహుడు :-ఆ మేవాడాధిపతి యెవరు? నీవు ఉన్మాదావస్థలో లేవుకద! లేక నీ మాటలు గూఢ రహస్యగర్భితములా? స్పష్టంగా చెప్పు; నీకేం కావాలిప్పుడు?

పన్నా :-(ఉదయుణ్ణి ముందు నిలిపి) ఇతడే మహారాణా సంగ్రామసింహుని చిన్నకొడుకు ఉదయసింహుడు. (బహదూర్‌సింగు ఆపాదమస్తకమూ వొణికిపోయి స్తంభితుడౌతాడు.)

ఇతని దాదిని నేను. ఘాతుకుడైన వనవీరుని కత్తివేటునుండి రక్షించి యిటు తీసుకొచ్చాను; శరణిచ్చి, పోషించండి ఇతన్ని.

బహదూర్ :-ఏమిటి పన్నా! ఒక్క గుక్కలో చెప్పేశావు? (విచారంగా) చందన్ ఎక్కడ మరి? ఇతడు రాజకుమారుడు ఉదయుడా?

పన్నా :-ఔను. ఇతడే రాజకుమారుడు ఉదయుడు.

ఆశాశాహుడు :-అయితే మరి ఉదయసింహుడు వనవీరుని ద్వారా హత్యగావింపబడ్డట్టు లోకంలో ప్రతీతిగా ఉంది. నీవెలాగ రక్షించి తెచ్చావితన్ని?

పన్నా :-సొంతకొడుకును బలి యిచ్చుకుని.

బహదూర్ :-(ఉత్సుకుడై) ఎవర్నీ చందన్‌నా?

పన్నా :-(విచారంగా) ఔను. చందన్‌నే (బహదూర్‌సింగు హతోత్సాహుడౌతాడు). నాకు హంతకుని యుద్దేశం తెలిసింది. వనవీరుడు రాకముందే ఉదయుని సెజ్జమీద చందన్‌ను పడుకోబెట్టాను. ఎందుకోసం నా కన్నకొడుకునుకూడా బలియిచ్చుకున్నానో అందుకోసమే మీరుకూడా ఇతన్ని రక్షించండి.

బహదూర్ :-ఇదంతా వినిపించేందుకా నన్ని రాజదర్బారుకు తీసుకొచ్చావు? పన్నా! ఈసంగతి ఇంతవరకు నాకు చెప్పకుండా దాచియుంచినదానివి, అలాగే, గుప్తంగానే ఉంచలేకపోయావా? ఇతడు చందన్ కాదని ఎందుకు చెబుతున్నావు?

పన్నా :-అయితే పవిత్ర-చిత్తోడు-వంశము నిర్మూలమైపోవడము మీ కిష్టమేనా? మన సేవ అమరమైనదిగా చేసుకోవలెనంటే యజమాని ప్రతిష్ఠ నిలువబెట్టాలి; అందుకు బలిదానమైనా ఈవలసివుంటుంది.

బహదూర్ :-నేను సంసారాన్నీ, సమాజాన్నీ త్యజించి నిర్జనారణ్యాల అంధకారంలో దేన్నో వెదక్కుంటూ ఉన్నాను. ఇంతకాలానికీ రాజకుమారుడి వదనం కనిపించింది. నీవేమో ఇతడే పుత్రుడన్నావు.

పన్నా :-పోనీ, మీమటుకు మీరే ఆలోచించండి; ప్రభువుక్షేమం కోరి పుత్రుణ్ణి బలియిచ్చుకోవటం పాపమేమో. చందన్ మరణించలేదు. ఆ అనంతనీలిమాకాశంలో అదుగో అగడుకూడా ఒక తార. ఇతన్నే చందన్‌గా భావించుకోండి; తానుకూడా చందన్‌ననే చెప్పుకుంటున్నాడు.

బహుదూర్ :-పుత్రుడనే మృగతృష్ణ చూపించి నన్ను మళ్ళీ ఈ మాయాసంసారంలోకి ఆకర్షించావా?

పన్నా :—(రాజుతో) ఈ రహస్యమంతా నేనుగాక రాజమహలులోని ఒక్క బారీమాత్రం ఎరిగున్నాడు. అత డిది గుప్తంగానే ఉంచుతానని ప్రమాణంచేశాడు. మీరైనా దీన్ని ఎక్కడా వెలిబుచ్చరని ఆశిస్తున్నాను.

బహుదూర్ :—నేనుకూడా అలాగే చేయాలి కాబోలేం?

పన్నా :—ఔను. మీ రెప్పుడైతే ఇతన్ని చందన్‌గానే భావించుతారో అప్పుడే ఈ రహస్యం తనంతట అదే గుప్తంగా ఉండిపోతుంది.

ఆశా :—నువ్వు కోరినట్టు ఈ రహస్యాన్ని ఎంతో జాగ్రతగా గుప్తంగానే ఉంచుతాం. నీ రాజభక్తి అమూల్యమైనది; సందేహంలేదు. కాని, నీకు తెలుసునుకదా! మహారాణా వనవీరుని చక్రవర్తిత్వం ముందు కమల్‌మీరు అధిపతి యొకలెక్కలోవాడుకాదు. నీవే చెప్పు; దుర్బలుడు ఆశాశాహుడు ఆయన శత్రువుకు ఆశ్రయం ఇవ్వగలడేమో. అది మహారాణా వనవీరునికి తెలిస్తే ఆశాశాహుని తల ఎక్కడి కెగిరి పడుతుందో బాగా ఎరుగుదును.

పన్నా :—మీరు తప్పక శరణివ్వాలి. మీమీదనే కొండంత ఆశ పెట్టుకు వచ్చాను. మీరంత పిరికివారా? ఆ హంతకుడికంత ప్రతాపం ఉందా? రావుజీ! నా ఆశ నిరాశ చేయవద్దు.

ఆశా :—నా దుర్బలత్వాన్ని చెప్పాను కదూ!

పన్నా :—సత్యపక్షాన్ని విడవకండి మహారాజా! సంగ్రామసింహుడు మీకుకూడ సేవ్యుడే.

ఆశా :—నిస్సందేహంగా. ఆయన నా కనేక ఉపకారాలు చేశారు.

[ఆశాశాహునితల్లి ప్రవేశిస్తుంది]

రాజమాత :-నీవు మరచిపోలే దనుకుంటాను, నాయనా? ఒకసారి యుద్ధభూమిలో ఆయన నీ ప్రాణాల్ని కాపాడి, తొంభైగాయాలతో నిండియున్న తన శరీరాన మరొకగాయాన్నికూడా సహించాడు. అంత ఉపకారియైన స్వామిసేవ తప్పకుండా నిర్వహించాలి నాయనా! (పన్నాతో) అమ్మా! నీ మాటలన్నీ చాటునుండి విన్నాను. నువు పూనుకున్న ఈ రహస్యప్రయత్నంలో సమ్మిళితను కావాలనే నిశ్చయించుకుని వచ్చాను.

పన్నా :-రాజమాత అనుగ్రహానికి రుణగ్రస్తురాల్ని.

రాజమాత :-[ఆశాశాహునితో] రాజకుమారుడికి శరణు ఇవ్వకతప్పదు. ఇతనిపాలన-పోషణ-భారం నేను వహిస్తాను.

ఆశా :-నీ బలవంతంమీద ఒప్పుకోవలసి వస్తున్నది. కాని, అమ్మా! ఈ సంగతి అత్యంతగుప్తంగా ఉండాలి. కాశీలో ఉన్న నా చెల్లెలి కొడుకుకూడా ఇంతే పొడుగూ, లావూ ఉంటాడు. ఈ రాజకుమారుడిక్కడ నా చెల్లెలికొడుకుగా వ్యవహరింప బడుతూండటం మంచిది.

రాజమాత :- అల్లే కానీ; భయపడవలసిన పనేమీ లేదు.

ఆశాశా :- అట్లనకమ్మా! ఈ సంగతి అణుమాత్రమైనా వనవీరునికి ఆచోకీ తెలిస్తే తన గూఢచారుల్ని నాల్గు వేపులకూ తరుముతాడు.

బహదూర్ :- అటువంటి చింతేమీ పెట్టుకోకండి రావుజీ! ఈ రహస్య-ద్వారంముందు నేను చౌకీదారుగా ఉంటాను. మీరేమీ భయపడవద్దు. నేను నీడవలె రాజకుమారుని వెంట ఉండి, ఈ రహస్యం బయలుపడకుండా కాపాడుతాను. ఈ నా దక్షిణహస్తం సంగ్రామసింహుని సేవయందు అర్పించాను; మిగిలిన ఈ సమస్త-అవయవాలూ సంగ్రామసింహ పుత్రుని రక్షణకే వినియోగపడేందుకు సిద్ధంగా ఉన్నవి. ఇంతవరకూ నా కుమారుడే అన్న భ్రమలో ఉన్నాను; ఆ భ్రమే సత్యమనుకుని ఇతన్ని నా కొడుకుగానే చూచుకుంటాను.

రాజమాత :- రాజకుమార్! నీకు స్వాగతం.

పన్నా :- అమ్మా! నీవు న్యాయానికి చేయూత ఇచ్చావు. నీకు జయం!

ఉదయ :- అమ్మా! నీవూ ఇక్కడే ఉంటావు కదూ!

పన్నా :- ఆ ఇక్కడే ఉంటాను. ఒక్కసారి మాత్రం చిత్తోడు వెళ్ళి నా ఆవశ్యకమైన వస్తువులు కొన్నింటిని తెచ్చుకుంటాను. ఇక నాకు నిశ్చింత. ఇంకా కొన్ని యితర విషయాలమీద నేనిక మనస్సు ఉంచాలి. వనవీరునికేమీ అనుమానం కలగకూడదు; నా పనులూ నెరవేరాలి. నేను ఇవాళే—ఇప్పుడే వెళుతున్నాను.

బహదూర్ :- నేను ఉన్నాను నీ అనుచరుణ్ణి రాజకుమార్!

[పన్నా చిత్తోడుముఖంగా వెళుతుంది. బహదూర్‌సింగు రాజకుమారుడి దగ్గరకు వస్తాడు]

[తెర పడుతుంది]

## దృశ్యము ౨.

[వనవీరుని మహాలు. ఉత్తేజితుడై వనవీర్, అతని వెనుక ఛందావత్ సర్దారు ప్రవేశిస్తారు]

వనవీర్ :- ఛందావత్ సర్దార్! ఎల్లప్పుడూ రాజభక్తుడివిగా సంచరించినవాడివి, ఇవాళ నీకింత దుస్సాహసమా? నేను స్వయంగా నా చేతులతో అర్పించిన పాయసపుదొన్నె స్వీకరించావు కాదు.

ఛందావత్ :- అయితే, అంతమాత్రాన ఏమి మునుగుకుపోయింది?

వనవీర్ :- నీకది స్వీకృతం కానప్పుడు విందుకసలు రావడం దేనికి?

ఛందావత్ :- నన్ను వంచించి ఆహ్వానం పంపారు.

వనవీర్ :- సమస్త సర్దార్ల మధ్యన నన్నవమానించావు. గుండు సలుపుపెడుతోంది, సర్దార్! అవమానాగ్ని లోలోపల రాజుకుంటోంది.

ఛందావత్ :-మహారాణాగారి యీ ఆదరతృప్త ఎందుకింత అధికమౌతోందో నాకు అర్థం కావటంలేదు. గౌరవలాలసత్వం ఎంత ప్రబలమౌతూ ఉన్నదో వినతములై యుండవలసిన తలలంత పైకి లేస్తున్నవి.

వనవీర్ :-మరి ఇదేమిటి? చిత్తోడేశ్వరు డిచ్చిన పాయసపుదొన్నె నీ వెందుకు స్వీకరింపలేదు?

ఛందావత్ :-చిత్తోడేశ్వర్! [కొంచెం మాగి] కాదు. పాయసపు దొన్నె యివ్వగల అధికారం తమ కేమాత్రమూ లేదు. ఒకవేళ—పరమేశ్వరుని కృపవల్ల అట్లు జరుగదు గాక—గుజరాత్ సుల్తాను మరొకసారి చిత్తోడుపై అధికారం చలాయించటము సంభవిస్తే, అతడిచ్చే దొన్నె మేము స్వీకరింపవలసినదేనా? ఎన్నటికీ స్వీకరించము. బప్పారావు శుద్ధవంశంలో జన్మించిన వారికితప్ప ఇంకొకరికా అధికారం లేదు.

వనవీర్ :-నేను సంగరాణా సోదరుడైన పృధ్వీరాజు పుత్రుణ్ణి కాదూ!

ఛందావత్ :-ఇంకా స్పష్టంగా చెప్పమంటారా?

వనవీర్ :-నీ వాక్యాలు నా అభిజాత్యాన్నీ పవిత్రతనూ శంకిస్తున్నై, చెడ్డ అసహ్యంగా ఉంది నీ వ్యవహారం. నీ సంగతేమిటో అంతు కనుక్కోవాలి.

ఛందావత్ :-నా అంతు కనుక్కొనేముందు తమ రింకొకర్ని ఎదుర్కోవలసి వుంది. మీ రేస్వప్నవీధుల్లో ఉన్నారో! కమల్ మీర్ సమాచారం వినలేదేమో!

వనవీర్ :-(చింతితుడై) కమల్ మీర్ సమాచారం! ఏమిటది?

ఛందావత్ :-ప్రస్తుత-చిత్తోడు-మహారాణాకు చాల విచారకరమైనదే పాపం! తమరు ఏ వంశాన్ని నిప్పంటించి నిర్మూలం చేశా మనుకుంటున్నారో ఆ వంశపుదీపిక కమల్ మీర్ కోటలో, వెల్తురులు చిమ్ముతోంది.

వనవీర్ :-అంటే?

ఛందావత్ :-ఉదయసింగు జీవించే ఉన్నాడు.

వనవీర్ :-(కంపితుడై) జీవించే ఉన్నాడా?

ఛందావత్ :-చిత్తం. అదిగాక, ఇంతకన్న విచారకరమైన విషయం మరొకటి; మేవాడ్ లోని ప్రముఖసర్దార్లంతా అతనికి తోడ్పడేందుకు సిద్ధంగా ఉన్నారు.

వనవీర్ :-మహా అయితే ఏమౌతుంది? వీరంతాకలిసి చిత్తోడుమీదికి దండెత్తి వస్తారు, అంతేనా? అయినా నీ మాటలు నేనెందుకు విశ్వసిస్తాను? నేను ఉదయుణ్ణి ఈ చేత్తో పొడిచేశాను. ప్రాణాలు విడుస్తూ అతడప్పుడు చేసిన సీత్కారం నాకిప్పటికీ జ్ఞాపకం ఉంది.

ఛందావత్ :-తమరు భ్రమపడ్డారు, అతడు ఉదయుడు కాదు.

వనవీర్ :-మరింకెవరు?

ఛందావత్ :- దాదిపన్నా కుమారుడు. రాజదూత నా మాటలు నిజమే నని రుజువు చేస్తాడు కావాలంటే. నేనూ వెళ్ళిపోతున్నాను (పోబోతాడు)

వనవీర్ :- ఆగు! ఎక్కడికి వెళుతున్నావు?

ఛందావత్ :- మీకేమీ భయంలేదుగా! కమల్ మీరు వెళుతున్నాను. చిత్తోడు రాజ్యానికి నిజమైన ప్రభువు అక్కడే ఉన్నాడు.

[ఛందావత్ సర్దారు నిష్క్రమిస్తాడు. రెండోవేపునుంచి శీతలసేని ప్రవేశిస్తుంది]

శీతలసేని :- తక్షకుడు బతికిపోయాడు నాయనా! నీవు కాలికింద నలిచివేసినది కేవలం రజ్జువే సుమా!

వనవీర్ :- ఔను. ఇప్పుడే అంతా విన్నాను. భ్రమపడ్డాను. సత్యాన్ని అసత్యంనుంచి పృథక్కరించలేక పోయాను.

[రణజిత్తు ప్రవేశిస్తాడు]

రణజిత్తు :- ఛందావత్ సర్దారు విద్రోహి అయాడు. రాజవీధుల్లో ప్రజలతో "మీ అసలైనరాజా ఉదయుడు జీవించే ఉన్నాడు" అని అరచుకుంటూ పోతున్నాడు.

వనవీర్ :- జీవించే ఉండనీ, రణజిత్! ఏంచేయగలుగుతాడు?

రణజిత్తు :- అతడు జీవించియుండుటమనేది అసంభవం మహారాణా! ఇది నిస్సందేహంగా విద్రోహులై పోయిన మన సర్దార్లమాయ. ఒకానొక అబద్ధపు త్యాగకథ పన్నాను కట్టిపెట్టి, వీళ్లు ఏ మట్టిబొమ్మలోనో ఉదయుడి ప్రాణాల్ని ఊదారు. అంతేకాని వాడెవడో ఉదయుడు మాత్రం కాజాలడు.

వనవీర్ :- ఏమైనాకానీ; మహారాణా వనవీర్ ఎవరికీ భయపడేవాడు కాదు. నేను కేవలం నా బాహుబలంతోనే వాళ్లందర్నీ ఎదుర్కొంటాను. పైగా కావలసినంత సేన ఉంది; సకాలానికి వేతనాలిచ్చి పోషిస్తున్నాను. సైనికులంతా నాకోసం ప్రాణాలర్పించటానికి కూడా సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడే రాజసభ సమావేశం కావాలి. పద, ఈ విషయమంతా అక్కడే విచారిద్దాం. (వనవీర్, రణజిత్తు, నిష్క్రమిస్తారు.)

శీతలసేని :- రణజిత్ ఊహ సరైంది కాదు. అతడు ఉదయుడే, మరెవరూకాదు. రాక్షసి పన్నా ఈ ప్రపంచంలో ఏమిసుఖం కోరి సొంతకొడుకునే మింగివేసిందో అర్థం కావటం లేదు. వైరి బాలకుడు బ్రతికిపోయాడు. వాడు బ్రతికి యుండకూడదు. నేనే స్వయంగా కమల్ మీరు వెళ్ళి, అతన్ని ఈ సారి తప్పకుండా నిర్మూలం చేసి వస్తాను. రణజిత్ వల్లకూడా కా దీపని. మారువేషం ధరిస్తాను; నా కట్టి సాహసంకూడా ఉంది. [నిష్క్రమిస్తుంది]

(తెరపడుతుంది)

# అభ్యర్థనము

ఉ॥ పైర పొలంబులో మిరెపుబండుల చెట్లను, బంతిపూల సిం
గారముఁగొన్న పెజ్జెడ నిగారపు మేనునగట్టు నీలపుం
జీర హొరంగు లీన వడిసేలను బిట్టులఁ బారఁదోలు నా
య్యారపు కాపుకన్నె! యెలుఁగాఁగ పాడుము తెల్గుకీరుతుల్॥

గీ॥ ఆమనిని మావిచిగురుల నామతింపఁ
గఱకువారిన కంఠంబు కమ్మదనముఁ
గూర్ప తేమావికొమ్మపైఁ గూరుచుండి
పాడగదె కోకిలా! తెల్గువాడి తనము॥

చం॥ ముసలితనంబునందు మెయి పోడిమి వాడినగాని చేతితో
పసఁదుగ నేసినట్టి ముడిబట్టనె కట్టి గృహంబునందు సొం
పెసగఁగ రాటముల్ వడుకు వృద్ధసువాసిని నీదు పూత వా
గ్విసరముచేత నాంధ్ర పృథివీ ప్రథనాఢ్య కథాళి పాడుమా!

చం॥ పడమట చందనంపుమలపై జనియించియు మేల్మిపూల పు
ప్పొడులను పొర్లి దారిఁబడి భూములనెల్లగమించి మెల్లఁ గా
లిడి భరతావనిం దెలుఁగుటేఱుల చల్లదనంబుఁబొంది మా
యొడళులఁ దాకుగాలి! కొని యెయ్యన రమ్మిటకున్ స్వతంత్రతన్॥

సీ॥ నెల్లూరు నెఱజాణలెల్ల స్నానంబాడ నాడెముంగొన్న పెన్నాస్రవంతి
రాణ్మహేంద్రప్రభుప్రాత దానాంబు సంతాన సమ్మిళిత గోదావరంబు
భువనేశ్వరికి ముక్కుపుడక తాకట్టుంచి గిరిభేదియై పాఱు కృష్ణవేణి
పలనాటి మగలనెత్రులు చిక్కగాపాఱ నదముగా ప్రవహించు నాగులేఱు.

ఆంధ్రదేశంబునకు కీర్తి నార్జనంబు
చేసి కాలంపు గర్భాన మూసియుంచె
దాని బాహిరపెట్టు నవ్వాని కొఱకు
గొంతువిచ్చి పిల్వుమి యాంధ్ర కోమలాంగి!

—కె. మీనాక్షీ దేవి.

# మాతా కస్తూరిదేవి

శ్రీ ఆచంట లక్ష్మీనరసింహం



"నిన్ను నెడబాయదెప్పుడు, నీడునీడపగిది నీ పతివ్రత మహాభాగ" యనువచనమును సఫలపరచిన జనకతనయయట్లు, ఖండఖండాంతరములకు సైతము గాంధిజీని వెన్నడించి, ఆయన నిష్టుర సత్యవ్రతములకెల్ల నాగి, ఆయనతోబాటు 40 సంవత్సరముల క్రిందటనే బ్రహ్మచర్య దీక్షాధారిణియై, లోకసేవావ్రత ధారిణియై భర్తతోపాటు కారాగారములందు సైతము ప్రవేశించి, కష్టనిష్ఠురముల నపార సహనశీలముతో భరించి, లోకోత్తరుడైన గాంధిజీ ధర్మనిష్టకు దోహదమిచ్చి చరితార్థయైన సాధ్వీమణి కస్తూరిదేవి. ఈమె జీవితమును గూర్చి గాంధిజీ "ఆత్మకథ" నుండి గ్రహించిన వివరములు దిగువ తెలుపుచున్నాను.

ఈమె తల్లి దండ్రులను గూర్చిన వివరములు తెలియవు. ఈమె యించుమించు గాంధిజీకి సమవయస్సగుటచే, 1870 సంవత్సర ప్రాంతమున జన్మించియుండును. తల్లిదండ్రులామెకు చదువుచెప్పించియుండక పోవుటచే, కాపురమునకు వచ్చునాటికీమె సంతకమైనను చేయలేకుండెను. కాని యీమె మొదటనుండియు, మాయ, మర్మములెరుగని ముగ్ధ. బాల్యమునుండియు స్వాతంత్ర్యప్రియ, మితభాషిణి.

ఆకాలపు పద్ధతులనుబట్టి కస్తూరిదేవికి 7వ ఏట గాంధిజీతో ప్రధానముజరిగెను. నాటి సాంప్రదాయమునుబట్టి ఖర్చులు కలసివచ్చుట, వైభవోపేతముగ జరుగుట, పెద్దలకండ్లుచల్లబడుట యనునవే ప్రధానములగుటచే, వధూవరుల వయస్సుగాని, ఒకరి నొకరికి చూపుటగాని, ఒకరొకరి సమ్మతులు తీసికొనుటగాని లేకుండనే, గాంధిజీకి, వారిరెండవ యన్నకు, పెదతండ్రికుమారునకు ఒకే ముహూర్తమున, వివాహములు నిశ్చయించబడెను.

పెండ్లికి వచ్చుదారిలో, బండి తల్క్రిందులై, గాంధిజీ తండ్రికి ఒడలంతయు నెత్తురయ్యెను. అయినను సర్వసిద్ధమైన ముహూర్తమాపవీలుగామిచే, ఆయన హర్షము దెచ్చిపెట్టుకొని, పెండ్లిపీటలవద్ద గూర్చుండిరి. యథా శాస్త్రీయముగా, మహావైభవముగా, వివాహములు జరిగిపోయెను.

13వ ఏటనే కస్తూరిదేవి అత్తింట ప్రవేశించెను. నాటికి ఆమెకు చదువు బొత్తుగా రాదని పైన దెలిపియేయుంటిని. పైగా నేర్చుకొనవలెనను కుతుకము సైతమామె చూపెడిదికాదట. అయినను గాంధిజీ తాను ఆంగ్లవిద్యా సంస్కారము కలిగియుండుటచే, ఆమెను విద్యావతిని చేయసంకల్పించెను. అందుకెన్నియో అడ్డములు; మనలోవలెగాక, గుజరాతులలో పరదా యాచారము విపరీతముగా నుండుటచేతను, పగలు పెద్దలుండగా భార్యతోమాటాడుటకు సిగ్గగుటచేతను, రాత్రులందుమాత్రమే పాఠములునేర్పవలసి వచ్చుటచే, ఆమెచదువు, హెచ్చుసాగలేదు. గుజరాతీలో చదువను, వుత్తరములువ్రాయను తగుజ్ఞానము మాత్రమే యామె నేర్వగలిగెను. తానప్పుడు హెచ్చుకాలము వినియోగించగలిగిన నామె యీపాటికెన్నడో విదుషియై యుండునని, కాకుండుటకు బాధ్యత తనదేనని గాంధిజీ పరితాపము.!

యువకుడగు గాంధిజీ, తనదేవి నత్యంతము ప్రేమించుచుండెను. నాటి ఆయనభావములు విచిత్రముగానుండెను. తానామెను హెచ్చుగా ప్రేమించుచుండుటచేతను, ఆమెను తన భావనప్రకారము, ఆదర్శగృహిణిగా నుండ గోరుటచేతను, ఆమెను యిరుగిల్లు, పొరుగిల్లకు, పేరంటములకు బోవలదని యాటంకపరచు

చుండెను. ఆమె చర్యలన్నిటిని సూక్ష్మముగా పరిశీలించుచుండెను. స్వాతంత్ర్యప్రియయగుట, కస్తూరిబాయికి కట్టుబాట్లు కంటకముగా నుండెడివి. ఆమె యిట్టియాజ్ఞలను ధిక్కరించుచుండెను. అందువలన తరచు గృహములో కలహములు జరుగుచుండెడివి. నాటి తన యపరాధమెన్నటికిని మన్నింపబడదగనిదని గాంధిజీ యుద్దేశము.

కాలక్రమమున, బ్రహ్మచర్య ప్రభావ మధికమైనకొలది, గాంధిజీ కన్నులు విడిబడి, భార్య దాసి గాదని, సహధర్మిణి, సహచారిణి యని, భర్తకష్టసుఖములందు సమానభాగినియని, ఆలుమగ లిరువురును సమాన స్వాతంత్రులే నని గ్రహించి, యాప్రకారము కస్తూరిబాయిని గౌరవించసాగెను.

భారతమహిళకు సొత్తైన సహనశీలము దేవీప్రకృతి గుణములలోనొకటి. గాంధిజీ ఆఫ్రికాలో, బారిస్టరుగా పనిచేయుచున్న రోజులలో, వారియింట పెక్కుమంది యుండెడివారు. వారిలోనొకడు క్రైస్తవుడు. పాశ్చాత్య పద్ధతి యిల్లగుటచే, గదులలో తూములకు బదులు మూత్రము విసర్జించుటకు కుండలుండెడివి. వీనిని బాగుచేయుపని నౌకర్లుగాక గాంధిదంపతులే చేయుచుండిరి. ఇంటివారితోబాటు అలవాటుపడ్డ యితరగుమస్తాలు, తమ కుండలను తామే శుభ్రపరచుకొనుచుండిరి. కాని యీ క్రైస్తవ గుమాస్తా క్రొత్తవాడగుటచే, ఆ కుండను కస్తూరిబాయి ఎత్తవలసివచ్చెను. ఆమె అన్నికుండలను ఎత్తెడిదేగాని, అస్పృశ్యుడని యతనికుండ నెత్తుట కసహ్యపడెను. పోనీ గాంధిజీ ఎత్తుటకును ఆమె ఇష్టపడలేదు. తానెత్తుటకా కష్టముగానుండెను. చివరకు, కన్నులనుండి ముత్తెములవంటి బిందువులురాల చేత కుండ నెత్తికొని, కెంపుచూపుతో, ముదలకించుచు, నామె మేడమెట్లు దిగసాగెను. (ఈ దృశ్యము నేటికిని తమ కండ్లకు కట్టినట్లున్నదని గాంధిజీ వ్రాసియున్నారు)

చేయుపని యుత్సాహముతో చేయవలెనుగాని, దుఃఖించుచుచేయరాదను సిద్ధాంతము గలవాడగుటచే, గాంధిజీ, క్రోధముతో నామెవెనుక పరుగెత్తి, యుత్తేజితస్వరముతో "ఈ యాగడములు నాయింట సాగ"వని గద్దించెను.

ఈమాట బాణమువలె నాటి, యామె "మీయింటిని మీరే యుంచుకొనుడు! నే నిదే పోవుచున్నాను" అనెను.

గాంధిజీ, క్రోధవివశతచే నీశ్వరుని మరచి, హృదయమున దయ యింకిపోవ, యామె చేయి బట్టుకొని, ద్వారముకడ కీడ్చుకొనిపోయి, వీధితలుపు సగముదెరచెను.

అప్పుడు కస్తూరిదేవి కన్నులనుండి గంగా యమునల బ్రవహింపచేయుచు, నిట్లు జవాబిచ్చెను.

"మీకు సిగ్గులేకపోవుగాక! నాకు గలదు. కొంచెము సిగ్గు దెచ్చుకొనుడు! మీరు నన్ను వెలికి ద్రోయుచో నెనెక్కడికి పోగలను? పుట్టింటికి పోవుదమన్నను, నా తల్లిదండ్రులీ దేశమున లేరుగదా? మాది ఓర్పుగల స్త్రీజాతి. కావున మీరభస సైరించ నేవలయు. ఇకనైన సిగ్గుదెచ్చుకొని, తలుపుమూయుడు! ఎవరైనచూచిన నవ్విపోదురు?"

ఈవిధమగు ఓర్పువలన నామె విజయయయ్యెను. ఇట్టి యోర్పునే యామె పెక్కుసారులు ప్రదర్శించి, మోహనచంద్రుని హృదయ సింహాసనాధిష్ఠిత యయ్యెను.

అటులనే, యీమె యకుంఠిత ధైర్యమును, ధర్మోత్సాహమును చాటు మరొక యుదాహరణ మున్నది.

ముమ్మారీమెకు ప్రాణముమీదికి వచ్చెను. మూడుసార్లును గృహవైద్యమువల్లనే నెమ్మదించెను. డర్బనులో సత్యాగ్రహము జరుగుచుండగా, మొదటిసారి తీవ్రమైన జబ్బుచేసెను. అప్పుడీమెకు, మాటి మాటికి, రక్తస్రావమగుచుండెను. ఒక మిత్రునిసహాయంవల్ల నాపరేషను చేయబడెను. దుర్బలముగా నుండు టచే, మత్తుమందీయకుండకనే, ఆపరేషన్ చేసిరి. అత్యధికమైనబాధ నామె ధైర్యముతో నోర్చికొనెను.

ఆ స్థితిలోనుండి తేరికొనుటకు, మాంసరసముగాని, మద్యముగాని యిచ్చుటవసరమని, డాక్టరు వాదించెను. లేనిచో నామె జీవించు నాశలేదని, అట్టిస్థితిలో నామెను తన యింటనుంచుటకు సైత మంగీకరించనని ఆయన గాంధిజీ కెరిగించెను.

ఈశంటిని గాంధిజీ యంగీకరించడని మనమందరెరిగిన సంగతియే. ఆయన దేవికి సంగతి సందర్భముల నెరిగించి, యామె యభిప్రాయమడిగెను.

అప్పుడామె కించుకంతయైన శక్తిలేదు. పరమ దుర్బలగా నుండెను. అయినను దిట్టతనముతో నామె యిట్లనెను.

"నేను మాంసరసమును ముట్టను. మానవజన్మము దుర్లభము. మీ చేతులలో ప్రాణములు విడిచినను చింతలేదు. అందువల్ల బ్రతుకుమీది తీపిచే, యీ శరీరము నపవిత్రముచేసికొనను. తక్షణము నన్నిచ్చట నుండి తీసికొనిపొండు! భయపడకుడు!"

డాక్టరిది విని యగ్గిరాముడయ్యెను. దారిలోనే ప్రాణము పోవచ్చునని హెచ్చరించెను. కాని అకుంఠిత నిశ్చయులు, ఈశ్వరునిపై నచలవిశ్వాసులు నగు నా దంపతుల నాపగలవారెవరు?

పూర్తిగా భార మీశ్వరునిపై వైచి, ఒకప్రక్క పాలసీసాను, మరొకప్రక్క వేడినీళ్ల సీసాయు నుంచి, దారముల డోలీలో గూర్చుండబెట్టి, యామెను బయటికి తీసుకొనివెళ్లిరి.

దారిలో నామె "నాకేమియు భయములేదు. మీరూరక తొందరపడకు"డని గాంధిజీకి ధైర్యమిచ్చెను.

ఈ విశ్వాసితుల నీశ్వరుడు రక్షించునని వేరుగా వ్రాయ నవసరములేదుగదా! జలచికిత్సచే నీమెకు క్రమముగా జవ కలుగసాగెను. ఉప్పు, పప్పుల మానుటతో నీమెకు పూర్ణారోగ్యము కలిగెను.

ఎట్టి ఘోరతపోనిష్టవల్లనో, అపూర్వమైన గాంధిజీ సాహచర్యమునందిన యీ యమ్మ, ఆయనకు నిత్యానపాయినియై, తోడునీడయై యుండి, నిత్యమును ఆయనకు సేవచేయు భాగ్యమునందుటే గాక, ఆయనకు వ్యాధులలోను, లోకభయంకరములైన ఢిల్లీ, ఎర్రవాడ, రాజకోట యుపవాసములలోను పరిచర్యయొనర్చి ధన్యయైనది.

గాంధిజీ కార్యక్రమమంతటిలోను యీమెకు పాలున్నదని వేరుగా చెప్పనక్కరలేదు. దక్షిణాఫ్రికాలో భారతీయ ప్రబోధమున కెంతయో తోడ్పడెను. బీహారులో జనసామాన్యమునకు విద్యగరపుటలో మిగుల శ్రద్ధవహించెను. అచటను, భారతదేశములోను, కడపట రాజకోటలోను యీమె చాలసార్లు కారాగారమునకేగి స్వాతంత్రదీక్షను వెల్లడించినది. నాగపూరు పతాక సత్యాగ్రహమునం దీమె ప్రాముఖ్య పాత్ర వహించెను.

ఈమె భారతదేశమునకు, ప్రపంచమునకు నొనర్చిన మరొక మహోపకారమును యిక్కడ జ్ఞప్తిపరచుటవసరము. స్థిరదీక్షాబద్ధుడగు గాంధిజీ జబ్బుపడి, పాలు త్రాగనను నియమమువల్ల తేరుకొనలేక, మృత్యువునకే సిద్ధపడుచుండెను. అప్పుడీమె దైవదత్తబుద్ధితో, మేకపాలు త్రావుడని యొప్పించి, యాయన ప్రాణములను కాపాడెను. ఇందులకు లోకమీమెకు కృతజ్ఞతాబద్ధమైయున్నది.

ఇక ఈమెనుగూర్చి సత్యవ్రతుడగు గాంధిజీ లేఖిని నిట నుల్లేఖించి సెలవు గైకొనుచున్నాను.

"నా యిల్లాలు మాయమర్మములెరుగదు. మా దాంపత్యము అదర్శమైనదని చెప్పలేను. ఏలన నా యాచరణలు చాలవరకు ఆమెకు యింపుగావు. మేమెన్నడును వానినిగూర్చి చర్చించము. చర్చించినను సారములేదు. బడిలో నేనుగాని, తలిదండ్రులుగాని యామెను చదివించలేదు. కాని హిందూ స్త్రీలందరిలో కొలదిగనో, గొప్పగనో యున్న యొక మహాగుణ మీమెయం దతిమాత్రముగా నున్నది. తలచియో, తలపకయో, ఎరిగియో, ఎరుగకయో నా పాదముల ననుసరించుటలో తన జీవితము సార్థకమని యామె నమ్మిక. మరియు జీవితము నిర్మలముగా చేసుకొనబూను నా పూనిక కామె ఎన్నడును అడ్డురాలేదు. మా యిరువుర బుద్ధిశక్తులలో భేదమున్నను, పై కారణమువల్ల మా జీవనము సంతుష్టమనియు, సుఖవంతమనియు, ఊర్ధ్వగామియనియు, నా యుద్దేశము."

భారత స్వాతంత్రము, లోకశాంతి నిమిత్తము భగవానుడీ పురాణదంపతుల శతవర్ష జీవులను జేయుగాక!

## నవపరిచయము*

అనువాదకుడు: శ్రీ పూర్ణానంద.

రాధకంతరమున నేమి బాధకలిగె?
విజనమున దానొంటిగ వెలయుచుండు,
వినదు పల్కుల, సర్వదా ఘనునిగాంచు
ధ్యాననేత్రాల; నయనంపు తార కదల
దే! విరతితిన, ధరియించు కావి చీరె
యోగిని విధాన, కబరికలాగి విప్పు,
హాసితవదన చూడ్కి నిల్పు అంబరమున
చేతులను జాపి ఏమియో చెప్పుచుండు
దృష్టి నేకమొనర్చి బర్హియుగళగళ
భాగమును గాంచు—ఇది నవపరిచయమ్ము
నలుపు చెలికానితో నని పలుకు దాసు.

—హిందీలో—"చండీదాస్."

---

* ఇది ప్రసిద్ధుడైన పదకవి చండీదాసుది. దీనిని ఆధ్యాత్మికంగా అర్థము చేసుకొనవలసిఉంటుంది అని పాఠకులకు మనవి.

# చిన్న కొడుకు

"భమిడిపాటి"

[ చిన్న మేనల్లుడు చిరంజీవి సుబ్బారావుకి ప్రేమాశీర్వాదములతో అంకితం. ]

'ఇదిగోటోయ్! బావా! ఇంకో మేనల్లుడు! ఇద్దరు కూతుర్లని కని పెళ్లి చేయాల్సిన పని నీమీదవుంది!' అంటూ అందిచ్చాడు రవణబావ తన చిన్నకొడుకుని.

'అన్నయ్యా! వాడికి సుబ్బారావు అనిపేరుపెట్టాం! మీబావ మాత్రం 'రాజు' అని పిలుస్తారు. అసలుమాటెలాగున్నా ఆడంబరాలు పోవుగా పంతులుగారికి!' నవ్వుతూ ఎదురయింది చెల్లమ్మ చిట్టి.

మొన్నమొన్న బొమ్మలపెళ్లికని నాతో పంతంపట్టే చెల్లమ్మేనా యిప్పుడు తన చిన్నకొడుకు పెళ్ళిమాట లంటుంది!

'చిట్టీ! చాలా బాగుందమ్మ పేరు! సుబ్బారావు అనేపేరుతో ప్రసిద్ధ పురుషులున్నారు ప్రపంచంలో! నీ కొడుకు కూడ ఏ ప్రాపసరో అవుతాడులే!'

'అదెంతపనోయ్ బావా! నీవంటిమావలుంటుంటే అవడానికి అభ్యంతర మేమిటి! ఏదైనా అవుతాడు!' నాజోస్యాన్ని నవ్వుతూ బలపరచాడు రవణబావ.

'రానివాడివి చాలారోజులకి వచ్చావు ఒక నెల్లాళ్లపాటయినా వుండిపోరాదూ అన్నయ్యా!'

'అదెలాగవుతుందమ్మ! ఈ వారంరోజులు సెలవకే నానా అవస్థ పడాల్సొచ్చింది, ఇదిగో! ఈ 'యువరాజుగార్ని' 'సందర్శిద్దామని' వచ్చేయాల్సొచ్చింది!'

దీవనతో పిల్లాడి నుదుటిమీద ముద్దులు కురిపించాను. ఆ లేత మాతృహృదయం ఆనందంతో వికసించింది.

'అన్నయ్యా! వీడు చాల దురదృష్టవంతుడు. లేకపోతే అంత హాయిగావుండే సంసారం ఎలా మారిపోయిందో చూశావా? పెద్దవాడికి జరిగిన 'ముద్దు' లో వీడికొక పదోవంతయినా వుందీ? ఆఖరుకి కాళ్ల గజ్జె కూడలేకుండా మొలకొకమువ్వయినా లేకుండా ఎలాగున్నాడో చూశావా?

'పిచ్చిదానిలాగున్నావు పిల్లా! ఎప్పుడూ ఒక్కలాగేవుండమంటే వుంటుందా? అందరికి ఒక్కలాంటి వైభవము రమ్మంటేవస్తుందా? నిజానికి యిలాటివారే ముమ్ముందు గొప్ప అదృష్టవంతులు, సుఖజీవులు అవుతారు తెలుసా? దీనికేం విచారించనక్ఖర్లేదు చిట్టీ!'

'అసలే లేదనిబాధ, అందులో ఆయనేమిటో ఈమధ్య పజిల్సపిచ్చిలో పడి కానీ అడుగుతే లేదంటారు. ఆ సమయానికి రెండూ మూడు అప్పయినా చేసి కట్టిస్తుంటారు.'

దీనికితోడు రాత్రి పన్నెండు, ఒంటి గంట వరకూ ఏదోచదవడం, వ్రాయడం.

ఆ తలక్రింద చూడు ఎన్ని పుస్తకాలున్నాయో! మనిషిని చూచేవుగదా ఏం సుందరంగా వున్నారో!...భోజనం, నిద్ర సమయానికి లేకపోతే ఎలాగుంటారు మరి? నువ్వేనా చెపుదూ అవి వదిలేయమని. యిలాచూస్తే పిచ్చిఎత్తేలా అగుబడ్తున్నారు'

‘ఇదంతా కొన్నాళ్ళేలే! చేతిలోది కాస్త తగ్గగానే ఈ ఆశలన్నీ పుట్టుంటాయి. యిదీ అయిపోగానే ఆ సరదా తీరిపోతుంది!

అదిగాక యింటిసంగతి ముందుచూచుకోక, ఆ దుబారా ఎందుకో’

‘ఇదిన్నూ వీడుపుట్టాక పుట్టినబుద్ధే! అంతకుమునుపు లేనేలేదు. పిల్లడికి దగ్గుగావుంది మందు తెమ్మంటే, ‘నేనేం మందులూ తేలేను. అదేతగ్గుతుంది రెండురోజుల్లో!’ అంటారు.

‘నే నెక్కడా ఏం తేగలను? ఇదంతా వీడి కర్మంరా!’

‘కంటనీరుపెట్టకు చిట్టీ! అనవసరంగ సంసారభారం నెత్తిని వేసుకుంటున్నావు. కష్టకాలాల్లో ధైర్యంగా వుండగలిగేదే జీవితమమ్మా! పాపం చిన్నదానివి నీకు ఈ తాపత్రయం పట్టుకుంది! అవునుగాని, ఈకడుపు మీదేంటీ పిల్లాడికి గట్టివుండలా తగుల్తూంది?’

‘ఎదో వేడికి పుట్టిన గడ్డలే! చందనంతీసి పెడ్తాను తగ్గుతుంది. లే! లే! భోజనంచేద్దువుగానీ ఆయనకోసం ఎదురు చూస్తే తెల్లవారదూ?’

♦ ♦ ♦ ♦

‘ఇదేమిటో అర్థంకాలేదండీ, మామూలుగా ఏదో శగగడ్డ అనుకున్నా కాని ఏమీ తగ్గడంలేదు. సరిగదా పెద్దదవుతుంది. అంతేగాక మరోరెండు చోట్లకూడ అగుబడ్తూంది. ఎలాగయినా కాస్తమాసి డాక్టరుకి చెప్పి పెడుదురు?’

బయట అరుగుమీద పళ్లుతోముకుంటూన్న రమణమాష్టర్‌తో మెల్లగా చెప్తూంది చెల్లమ్మ.

అప్పుడే లేచివచ్చాను. ఈమాటలు వినగానే భయమేసింది. ఏమొచ్చినా ఎన్నాళ్లు వుండి పొమ్మంటుందో!

‘ఏదీచూడని! నాకేమీ అర్థంగాలేదు! ఎవరో చిన్నపిల్లల సంగతి తెలసిన ముసలమ్మలని కనుక్కో. తరువాత ఏదోవిధానం ఆలోచిద్దాం...చూడవోయ్‌బావా! తగుల్తే వరుసమీద డాక్టర్లకే! చూస్తూండగా యిచ్చానా మొన్న ముప్పైరూపాయలు డాక్టరుకి. గతనెల నాకు జ్వరం. మీ చెల్లమ్మకి ఎప్పుడూజ్వరమే! ఆదేం శరీరాలోగాని! వాడూ మొదటివాడు మొన్నటికి నయం కొంత దగ్గు తగ్గి. యిక ఈ చిన్నవాడు పుట్టినదగ్గర్నుండీ జబ్బులే! యిప్పుడేదో మళ్ళీ తెచ్చాడు; చూద్దూ!’

‘డాక్టర్ను రమ్మనండీ బావ! ఈ ఖర్చు నేనిస్తాను. లేకపోతే పిల్లాణ్ని వదిలేస్తామా?’

‘అంత చికాకు చేస్తుందంటావోయ్!’

కాఫీకని లోపలికి వెళ్లిపోయాడు.

♦ ♦ ♦ ♦

‘ఎదురింటావిడ చెప్పడం ఎద్దో పిల్లలకి మామూలుగ వచ్చేజబ్బని, రెండు రోజులు ఓపికపడ్తే తగ్గిపోతుందనీ. ఏమిటో అన్నయ్యా నాకు మా భయంగా వుంది. నువ్వీమూడురోజులూ వుండి, పోరాదూ!’ అంటూ కంట తడిపెట్టింది చిట్టి.

‘ఇప్పుడొచ్చిన భయ మేమీలేదమ్మా! మూడు మాసాలయినా వుంటాను. నీసౌఖ్యంకన్న నాకు కావలసిందేమిటి చెప్పు?’

అని సమాధానపరచాను భగ్నస్వరంతో. చెల్లమ్మ బాధకి హృదయంలో అర్థంకాని ఆవేదన కలుగుతూంది.

మూడురోజుల్లో ఒంటిమీద పదిగడ్డలవరకు అగుపడ్డాయి. వెనుకటివాటి నివారణ లేదుగానీ దిన దినమూ వాటి సంఖ్య అధికమవుతూంది.

చూస్తుంటే నాకేమీ అర్థంకాలేదు. భయమూ వేసింది.

ఏంచేసేందుకు తోచడంలేదు. పిల్లాడు ఒంటిమీద చెయ్యివేస్తే ‘కెవ్వు’మని ఒకటేఏడ్పు! పక్కలకు ఒత్తిగిలలేడు.

ఎల్లప్పుడూ తల్లిరొమ్ముమీదనే మూల్గుతూ, బాధనిభరించే కళ్లు మూసుకునివుండడం.

ఒక్క నిముషం తల్లిని విడిచేందుకులేదు. స్నానంలేదు, పానంలేదు, భోజనంలేదు, కదలవీల్లేదు.

మంచాన్నే అంటివుండేది చిట్టెమ్మ. ఒకావిడ చెప్పింది. ‘పిల్లల జబ్బులు లీలగా బాగుచేసే వైద్యుడు దగ్గరగ్రామంలో వున్నాడు, వెళ్లిచూపితే మంచిది’ అని. ఆరాత్రి తెల్లవార్లూ నిమిషమేనా నిద్దర లేదు, ఒకటే ఏడ్పు!

అర్థంకాని ఆ చిన్నవాడిబాధకు అనవసరభయం పడిపోతూంది ఆ కన్నతల్లి.

ఇంటిపనులూ, బడిపిల్లాడి జాగ్రత్త చూసుకునేసరికి తల దిమ్మెక్కి పోతూంది రవణబావకి.

ఎలా వదిలివెళ్లేదీ! మళ్లా సెలవు కోరుతూ వుత్తరంవ్రాశాను.

మర్నాడు తెల్లవారుతూనే బండి కట్టించుకున్నాం. బయలుదేరాం.

బండి కుదుపుకి దారంతటా హాయిగానుండి పిల్లాడు ఊరుకున్నాడు.

చూచాడువైద్యుడు. ఆలోచించి, ‘సాయంత్రం ఎవరినయినా పంపండి. ఓ చెక్కయిస్తాను. గంధంతీసి పూతురుగానీ’ అన్నాడు.

ఆ యిచ్చేదేదో, మమ్మల్ని చంపక అప్పుడేయిస్తే- ఊహూ! తన వైద్యం కట్టుబాట్లు అతిక్రమించకూడదట!

సాయంకాలం ఆ రాళ్లుతేరిన రోడ్డంత, ఆరుమైళ్లు పరుగున వెళ్లితెచ్చాను. గంధంతీసి పూశాం.

రాత్రి షుమారు పన్నెండు కావచ్చింది. అంతవరకు ఏడ్చి మరి ఏడ్వలేక ఊరుకున్నాడు పిల్లాడు.

అర్థంకాని ఆ కళ్లలో తన హృదయమంతా పెట్టేసుకుని చూస్తూంది ఆ మాతృదేవి చిట్టెమ్మ.

రవణబావ పెద్దపిల్లాడితో గూడ అప్పుడే గదిలోకివెళ్లి పక్కమీద చేరబడ్డాడు.

‘అన్నయ్యా! నువ్వూ వెళ్లి కాస్సేపు నిద్రపోరాదూ! ఊరుకున్నాడులే! నేను చూస్తుంటాను, ఏమన్నా అవసరముంటే ఆయన్ని పిలుస్తాలే’ అన్నది చిట్టి, నాయందు తన బాధాహృదయంలో సానుభూతి వుందన్నట్టు.

నేను మెల్లెక్కుతూ, ‘భయంపడకమ్మా! ఈ పిల్లలతోనూ కాని అవస్థ తల్లులికి!’ అని ఓదార్చాను.

పక్కమీద పడుకున్నానేగానీ నిద్దర రాదు.

'...తల్లి! ఎంతటి బాధలుపడుతూంది తనయుని క్షేమానికి? వాడికిబాధగాదు ఈమెకీ! నిద్రాహారాలులేక పథ్యాలతో, భయపూరిత హృదయంతో బాధపడే ఆ చిన్నకొడుకుని చూచి ఎంత పరితపిస్తోంది ఆ కన్నతల్లిహృదయం!

మాతృత్వము ఎంత కఠినము! యింత కష్టపడి కనిపెంచిన తల్లిని తెలియక ఎంత అనాదరణ చూపుతారు, అవమాన పరుస్తారు పెద్దవారయాక ఈ తనయులు!

తనయులు వీరేనా!!

ఎన్ని చేసినా, ఈ జీవితమంతా ఆమె సేవకే వినియోగించినా తల్లిఋణం తీర్చలేం.

ప్రపంచంలో నూటికి తొంభైతొమ్మిదిమంది తల్లికి ఋణపడినవారే!...'

అని అగాధమైన చీకటిలోకి చూస్తూ, ఆలోచిస్తున్నా.

'అయ్యో, అన్నయ్యా!...'

త్రుళ్లిపడిలేచాను. గబుక్కున మెట్టుమీద కాలువెయ్యడంలో 'ధడేలు'మని చప్పుడుతో కాలుజారి పోయింది. హృదయంతోపాటు ప్రక్కగోడకు బుర్ర తగిలింది గావున నిల్చానుగానీ లేకపోతే ఏమయేవాడ్నో?...

తొందరగా వెళ్లాను.

'చూడు అన్నయ్యా! కదలిక ఏమీలేదు. కదిలించినా ఏడుపులేదు. ఆ చూపులు ఎలాగున్నాయో!...నాకు భయమేస్తూంది.'

'భయంలేదమ్మా! చిన్నవాడా మరి! ఆ బాధకి తాళలేక, అలసిపోయాడు అందుకే...పాలివ్వు! నేనుంటాను యిక్కడ. అనవసరంగా భయపడతావమ్మా!'

ఓదార్చేందుకు అలాగన్నానే గానీ సాపూ సంశయం ఓ ప్రక్క పీడిస్తూనేవుంది.

ఆ వాడిన తల్లివదనం చూస్తే ఆ చూపులకు నా హృదయం నీరయి కనులవెంబడి రాసాగింది.

చూస్తే చెల్లమ్మ భయపడ్తుందని బుర్రవంచుకుని పచారుచేయసాగాను.

'డాక్టరు యివేళ రమ్మన్నారు. ఆస్పత్రికి తీసుకవెళ్తే పరీక్షచేస్తారు. నేనూ వస్తాను. నువ్వూ చెల్లమ్మా పిల్లాడ్ని తీసుకెళ్లండి. ఆలస్యమయినా బాధలేదు. నేను ప్రయివేటుకి శెలవుచెప్పి వస్తాను.'

అని పొద్దున కాఫీలు త్రాగేటప్పుడు చెప్పేసి వెళ్లిపోయాడు రవణబావ.

హాస్పిటల్ కి చేరేసరికి 9 గంటలయింది.

'రోగుల్నీ, మందుల్నీ చూచుకుని డాక్టరుగారు వచ్చేవరకు మరో అరగంట కావచ్చు.'

'అయితే నేను బడికి వెళ్తాను. నువ్వుంటావుగా దగ్గరా! చూడు డాక్టరేమంటారో!'

వెళ్లిపోయాడు.

మరో ముప్పావు గంటకల్లా డాక్టరుగారొచ్చి పరీక్షచేశారు.

'సామాన్యంగా బాగయేలా తోచదు. Open చేయడమే కర్తవ్యంలా అగుబడ్తూంది.'

చెల్లెమ్మ భయపడ సాగింది.

'కోస్తే బతుకుతాడా? ఆర్నెల్ల పిల్లవాడికి ఒంట్లో ఏముంట్టుంది డాక్టరుగారూ!'

'ఏమీలేకపోతే బాధలేదుగానీ, యివుంటే మంచిదా? ఒక్కొక్కటీ ఎంతకని మాన్పచూస్తాం?'

'ఒళ్లలా రాళ్లలా ఆగడ్డలు పుట్టుకరావడం బాగుందిగానీ కోతలే బాగులేదా! కానివ్వండి...'

'కొత్త కత్తులకి పిల్లాడిరక్తం బోణీ!' నర్సులతో పరియాచకంగా అంటూ వెళ్లిపోయాడు డాక్టరు.

'ఏదో మీరే నిర్ణయించండీ, నేనేలా.'

'వద్దన్నయ్యా! నాకేమో భయంగావుంది. మరేంచేస్తారో! నేనిక్కడమాత్రం వుండలేను.'

తొందరపెట్టూన్న ఆ పరితప్త మాతృహృదయంకి ఎలాటి సమాధానం చెప్పలేకపోయాను.

యింటికి వచ్చేశాం.

'ఏం? ఆపరేషను చేస్తే ఏం కొంపమునిగిపోయింది? యిలా వాడు, వాడితోపాటు మనమూ బాధ పడడము బాగుందంటావా? అసలుకే లేదనిబాధ అందులో యిదిగూడ. ఏన్నాళ్లూ?...కానీ మనవాడయితే బ్రతికివస్తాడు, లేదా...ఎవరు కర్తలుందానికి? నేను మొదటే చెప్పలేదు? ఎవడి ఖర్మంకి వాడేబ్రతుకుతాడని. మరేం ఆలోచించక డాక్టరు చేతిలోపెట్టి నమస్కారంచేయి! అదృష్టముంటే బ్రతికివచ్చాడా మనవాడే. లేదా..."

ఆలోచనకు కూడ అవకాశం లేకుండా అదే రవణబావ మాటలకు మారాడకుండా ఒప్పుకుంది చిట్టెమ్మ.

'నువ్వుకూడ పద బావా! యివేళ ఆపనిచేయిద్దాం. యింకేమయినా మందులుచెప్తే తెద్దువుగానీ!'

♦ ♦ ♦ ♦

'ఈవేళ రెండు openచేసాను. రోజువిడచి రోజు చేయాల్సంటుంది ఆపరేషను.'

పిల్లాడి రక్తబలంకి "Vogan" కొని పాలలో చుక్కలు వేసి యివ్వండి." అంటూ 'సల సల' మరుగుతున్న నీటిలో 'తళతళ' మెరసే కత్తి తీసి రెండుగంట్లు పెట్టేసి పోయాడు డాక్టరు. అబ్బా!... ఎంతఘోరం! మామూలు హృదయాలు ఆగలేవు ఆ దృశ్యానికి. రక్తంపేరు చెప్తేనే సొమ్మసిల్లేవారు ఆ రక్త పాత్రను చూచి మరి బ్రతికేదేంటి?

రవణ బావ నే చూడలేనని బయటకు వెళ్లిపోయాడు. మధ్యలో పిల్లాడు హాతాయించి పోతాడు దాహంకని చెల్లెమ్మను లోపలే వుండమన్నారు.

ఆ రక్తం...తన చిన్నకొడుకురక్తం ...కనుల చూచిన చిట్టి, ఎంత భయపడిందో...

పరితప్త హృదయం. ఆహారం నిద్రా ఎరుగదు...అందులో...

మిగిలిన పనులు పూర్తిచేసి పిల్లాడ్ని చేతులోపెట్టారు. తెరచి తెరవక కళ్లతో ఆయాసపు దృష్టులు కనబర్చుతున్న ఆ బాధిత బాలుని ముఖంచూచి విహ్వాల అయిపోయింది చిట్టి.

నడుస్తూంటే పదం తొట్రుపడటం గమనించి నేను 'చిట్టీ'అని పిలిచా గట్టిగా.

"ఆఁ!...ఆఁ!...అంటూంది పిచ్చిగా ఎటో చూస్తూ. చేతిలో పిల్లాడున్న సంగతే మరచి. ప్రమాదం గ్రహించి గబుక్కున చేతిలో పిల్లాడ్ని పుచ్చేసుకుని 'బావ'కి కేకవేశాను.

మూర్ఛబోయే అవస్థలోవున్న చెల్లెమ్మను పట్టుకుని, అరుగుమీద కూర్చుండబెట్టి రెండుసోడాల సపర్య చేశేవరకు తెలివి తెచ్చుకుంది.

మెల్లగా బండెక్కి యిల్లు చేరుకున్నాం, నాడు జరిగిన సంగతంతా చెప్పుకుంటూ.

♦ ♦ ♦ ♦

'క్రిందపడితే పిల్లాడేమవును? యింత దుర్బలమయితే ఎలాగమ్మా! కష్టాలూ అనుభవించ వలసినవే గదా! రేపట్నుంచి నువ్వురాకు! నువ్వు చేయవల్సినపని ఒక్కటే! అది డాక్టరుకి పిల్లాడ్ని అప్పగించేసి ఆ పావుగంటానూ దేవుడ్ని ప్రార్థించడం. 'సజీవుడిగా నా కొడుకుని తిరిగి యిమ్మని'అని ధైర్యం చెప్పాను.

ఆఖరు రోజున కట్టువిప్పేస్తూ అన్నాడు "అదృష్టవంతులండీ. నిజం, ఆ తల్లిగర్భం ఫలించింది. లేకుంటే' Hopeless Case '! అనుకున్నా మొదట"

ఆర్నెల్ల అబ్బాయి. వయస్సుకి మూడు రెట్లుకోతలు. శరీరంలో మూడొంతులు తరిగేపోయింది.

ఇంతకీ ఘోరం అనుభవించాడు. యికేబాధ వీడి జీవితంలో వుండదు! పిల్లాడిబలంకి కాస్త జాగ్రత్తపుచ్చుకోండి."

ఆనందంలో లోతుతెలిసిన చిట్టి ఆవేళ బండివాడిఅద్దెసొమ్ము సీధాగా యిచ్చేస్తూ అంది 'తాతా! మావాడు బ్రతికేడోయ్!'

'వెయ్యేళ్లుబ్రతుకుతాడమ్మా వెఱ్ఱితల్లి!' అని దీవెనతో వాడామెను సంతోషపరచాడు. మొన్నటికి సంవత్సరం నిండింది.

పుట్టినదినంనాటికి నన్ను రమ్మని చెల్లెమ్మ కోరిందంటూ బావ ఉత్తరంవ్రాశాడు.

చూచాను. సంవత్సరం బాలుడయినా ఆర్నెల్లు ఎదుగులేనివాడిలాగుంటాడు.

'మరేభయంలేదు చిట్టీ! యిక అదృష్టవంతుడే! ఆకళ్లుచూడు. వాటిలోనేగదూ తన జీవితం దాచు కున్నాడు? జీవితంలో ఘనత సూచిస్తున్నై'

'ఏమో అన్నయ్యా! నిముషమేనా నన్ను వదలి వుండడు. హమేషా ఏడుపే! ఓ ఆటాలేదు పాటలేదు. ఆనందంలేదు.'

మళ్లీ చెప్తున్నాచిట్టీ! యిలాటివాళే మున్ముందు ప్రయోజకులవుతారమ్మా!

తల్లిని మరచిపోలేరు! తల్లిని మరువనన్నాళ్లూ మానవుడి అభ్యుదయానికి లోటులేదు.

ఏనాడయితే ఈదేశంలో మాతృశక్తినెరుగక తనయులు ప్రవర్తిస్తారో, ఆనాడే ప్రళయం వచ్చిందని నమ్మ!

వీడు అక్రమంగా ప్రవర్తించినా వీడికథ ఎరింగిన లోకం చూస్తూ ఊరుకుంటుందా? ఆమాత్రం గుర్తించలేదూ!

కన్నతల్లి హృదయం అదే. ఈనాడు నేను భగవంతుడ్ని ప్రార్థిస్తున్నా 'ఈచిన్నకొడుకుని కన్న తల్లిహృదయం తెలిసి ప్రవర్తించేలా చేయ'మని!!

---

# ★ పల్లె పదాలూ – స్త్రీల పాటలూ ★

## శ్రీ కొత్తపల్లి రంగారావు

వ్యవసాయప్రధానం అయిన భారతదేశంలో నిజమయిన భారతజాతీయ హృదయం పల్లెటి సీమల్లోనే ప్రస్ఫుటం అవుతుంది. జాతీయజీవన రహస్యాలన్నీ పల్లెల్లోనే తెల్లం కాగలవు.

కాబట్టే, తరంగ తరంగాలుగా వస్తూవున్న జాతీయ పరిణామాలు పల్లెల్లో ఏరీతిగా ప్రతిఫలించిందీ పల్లెపదాలను తలుస్తేనేగాని ఎఱుకపడనేఱవు.

అదీగాక, అన్నిట్లోనూ కృత్రిమవాతావరణంలోనే పెరిగి పెద్దలైన పండితులకూ, పండిత కవులకూ ఆ వాఙ్మయం ఆనందాన్ని యీయలేకున్నా, పల్లెల్లోబుట్టి పల్లెల్లోపెరిగి, పల్లెల జీవన మాధుర్యాన్ని చవిజూచిన ప్రతి హృదయాన్నీ యిట్టే ఆకట్టుకొని, ఆనందపరసీమల్ని అందింపగలదు. నిజంగా పండితులకన్నా, పండితకవులకన్నా సామాన్య గ్రామీణులే ప్రకృతికి దగ్గఱివారు.

యిదివఱలో నగరాల్లో పండితులనుండి పుట్టిన సకల ఉద్యమాలూ తాత్కాలికంగా గెలుపొందినా చిరస్థాయులు కాలేక పోయినవి. అందుకనే నేడు ప్రతి ఉద్యమంకూడ సామాన్య మానవులకు సంబంధించే పుడుతూ ఉన్నవి.

సమాజంలో మనం సరియైన మార్పును తేవాలనుకొంటే మునుముందు పల్లెల్లోవున్న జనుల ఆచార వ్యవహారాలను, వారి హృదయ ప్రవృత్తులను దెలిపే పద (జానపద) వాఙ్మయాన్ని పరిశీలించాలి.

ప్రాతవి పరిశీలించి, సరిక్రొత్త జానపదవాఙ్మయాన్ని సృష్టించాలి. కాక, సమాజం మనం అనుకొన్నట్టు ఒక్కసారిగా మార్పుచెందలేదని ఊఱక పరితపిస్తే ఏంలాభం? ఏదీ యింతవఱకు ప్రచురించిన వాఙ్మయంలో కనీసం నాలవ వంతైనా పల్లెలకు చెందేది ఉందా? ఏమాత్రమైనా యీనాడు పల్లెలు అభివృద్ధిలో ఉన్నవీ అంటే అవి ఒక్కయువకుల రచనలవల్లేనని చెప్పాలి. అంతే కాని కఱడుగట్టిన పండితుల రచనలవల్ల కానేకాదు.

అందులోనూ సాబాలుగాఉన్న స్త్రీలను నిరక్షరకుక్షులుగా జేసివైచి, వారి అభివృద్ధిని గుఱించి ఉపేక్షించి 'మార్పు, మార్పు'అని దినదినమూ ఎన్నిసారులంటే మాత్రం మార్పెట్లా కలుగుతుంది? పురుషులూ, స్త్రీలూ, ఉభయులూ స్త్రీలనుండే తరిబీదులు కావలసినవారే గదా!

ఎంత అణచినా సహజమధురాలు, స్వభావపేశలాలు గదా స్త్రీ హృదయాలు. అందుకనే కాళిదాసు స్త్రీలకు 'అశిక్షిత పటుత్వం' ఉంటుంది అంటాడు. అట్టి స్త్రీ హృదయాల్లోనుండి వచ్చే గీతాలు ఎంతటి సున్నితాలూ, సుకుమారాలో వర్ణింప నవసరంలేదు. అప్రయత్న నిష్పాదితాలూ, అనుభవగళితాలూ అయిన పదాలు దైనందిన సాంసారిక జీవనద్యోతకాలు, స్త్రీ హృదయంలోని లోతుపాతులను ఎత్తిచూపేవి పల్లెలనిండా స్త్రీలవద్ద ఎన్నో ఉన్నాయి.

సరసాలయిన హాస్యపదాలు సమష్టి కుటుంబాల్లోని సభ్యుల హృదయాలను నిత్యనూతనానురాగ సూత్రాలచే బంధించివేసేవి యెన్నో గలవు. ఇటువంటివి మా నాయనమ్మ ఎన్నో పాడుతుంది. మచ్చుకు:

చక్కిడాలా బుట్ట
చంకబెట్టుకొని
సభలోన మా బావ
సంగీతపరుడు.

అబ్బాయి పెళ్ళాము
బొబ్బాయి గత్తె
ఎలుక జెముడూ క్రింద
వేసాల గత్తె.

వియ్యాల వారింట
విందు భోంచేసి
చెంబెత్తి చెయిగడుగ
శక్తిలేదాయె,

అత్తవారి సొత్తు
సత్తుగా దిని
అల్లుడూ వెళ్లూరు
గట్టెక్కలేదు.

స్థలాభావంచే వదులుతున్నాను.

కాబట్టి, ఇదివఱలో ఉన్నవానిని ప్రోగుచేయడం, వాఙ్మయ చరిత్రలో జేర్చడం, ఆపైని వాని ననుసరించి నూతన విషయాలపైని, నూతన భావాలతో నూతనాదర్శాలతో రసవత్తరములైన జీవవంతములైన పదాలను, గేయాలను ఇంకా స్త్రీ హృదయాలను ఏ ఏ రకంగా ఆకర్షింపవచ్చునో ఆయా రకాలుగా వాఙ్మయాన్ని సృష్టించాలని మనవి. ఆపని 'గృహలక్ష్మి' చాలావఱకు సాధించినది. అందుకు ఆంధ్రులు అభినందింపవలసిందే. స్త్రీలకు సంబంధించిన పత్రికలింకా బయలుదేరాలి.

వంద మాటలవల్ల గలిగే ప్రబోధం, పది పుస్తకాలు చదివినందున గలిగే చైతన్యం ఒక్క పదంవల్ల, ఒక్క పాటవల్ల గల్గుతుంది. అటువంటి పదాలనూ పాటలనూ వాఙ్మయకోటిలో పండితులు జేర్చకపోవడం ఎంతో శోచనీయం!

స్త్రీల దుస్థితినిగుఱించి ఎన్నో ఉపన్యాసాలు ఎన్నో ప్రబంధాలు పండితులు వ్రాస్తే వ్రాస్తారు గాని మా నాయనమ్మ పాడుతుంది.......

"ఆడదాన్నీ నేను అయి పుట్టితి గాని
గండ్ర గొడ్డలి క్రింద కొమ్మైన జాలు."

అని. ఇది పురుషులక్రింద యెంత నలుగుడువడి అన్నమాటయో! సూటిగా హృదయాన్నుండి వచ్చింది. సీతమ్మ శోకాన్ని వర్ణిస్తూ ఎన్నో రామాయణాలు పుట్టాయి గాని మా నాయనమ్మ......

"కన్నవారీ భూముల్లు
కాన నన్ను కాని
కానలో సీతమ్మ
కంట తడిబెట్టు.

ఆకాశమే మెఱుగు
కోయిలల కూత
అడవి యే మెఱుగు
సీత శోకమ్ము !!"

అని పాడుతుంది. సహృదయులు పరిశీలింతురుగాక!

# అసూయ

ముగ్ధ మత్కవితాలతాంగికి
స్నిగ్ధ సురభిళ పుష్పమాలల
మండనం బొనరింప నెంతో
మక్కువగ నుండెన్.
జ్ఞానసూనోపార్జనమునకు
సమ్మదోన్మిషితార్ద్రచిత్తత
పాఠశాలోపవనవాటికి
పయనమైతినిగా.
మామకీన పథమ్ములోనే
మంజులోపవనమ్ములెన్నో
అస్మదీయ దృగంచలమ్ముల
కయ్యెగోచరము.
గ్రామమందలి తోటలోనే
కమ్మతావులు చిమ్ముపూవులు
కలిగియున్నవటంచు ప్రేముడి
కబురు నంపితిగా!
గ్రామమందలి తోట గేటుకు
గడియవేసితిమంచు దెల్పిన
ఇతర పుర శృంగారవనమున
కేగితిని నేనే.
మంచి కుసుమము లచట దొరకమి
మది విచారముగొల్పె; నెట్లో
మమతతో గ్రామాంతరమునకు
మరలి వెళ్ళితినీ.
సంస్కృతంబను వృక్షమందలి
సాంద్రసురభిసుమమ్ము లచ్చట
పండితుండగు పరమ పురుషుడు
పంచుటను వింటిన్.
స్త్రీల కనువగు స్థానమచ్చట
చేరువలో లేనందుచే నే
పూల ఆశను వదలుకొని మా
పురములో నుంటిన్.
గ్రామమందలి తోటనుండియె
కబురుపంపిరి పూలు కొనుడని
కొనుట కచటికి పయనమైతిని
కోర్కె రేకెత్తన్.
వివిధ సుమముల కోసి తెచ్చియు
విపణివీథులనుంచి ప్రజలకు
విక్రయించుట గాంచితిని నే
విస్మయముగాగన్.
సుమములిమ్మని అడుగగానే
"సుమములకు నీవైనచో మా
తోటకే ర"మ్మనుచు పలికిరి
ఆటపాటలుగా.
నేను పూవులుకొనను గానీ
నేను తోటకు రానుగానీ
ఇట్లు మీర లసూయజూపుట
కేమి కారణమో!
ఒకరిచేతిలో కీలుబొమ్మగ
నుందువేని త్వదీయపాండితి
సక్రమంబుగ పంచిపెట్టన
సాధ్యమౌను గురూ!
శిష్యులందరి కొక్కవిధముగ
శీలభావముతోడ విద్యల
గరపుటే నీ ధర్మమంచని
అరయుమయ్యా గురూ!
పెరటిలోపలి విరులచేతనె
ప్రేమ మీరగ కవిత కన్నెకు
శిల్పచాతురిచే నలంకృతి
సేయుదాన సుమీ.

—వట్టికొండ విశాలాక్షి.

# సలహా





శ్రీమతి
ఇ. సరస్వతి

మోటారుకంపెనీనుంచి వస్తున్న లక్ష్మీకాంతరావుని ఎగాదిగా చూసి, 'ఏం ఇంతపొద్దున్న బయలుదేరావు ఇటు?' అన్నాడు రామారావు.

తలవంచుకుని 'ఆ కారు ఎంతచేస్తుందో తెలిసినవాళ్లకు ఎవరికయినా చూపించి ధరచేయాలి' అని యోచిస్తున్న లక్ష్మీకాంతము రామారావుని చూడగానే ఉలిక్కిపడ్డాడు.

కంపెనీలో ఉన్న స్నేహితుడితో మాట్లాడటానికి వచ్చానని సమాధానము చెప్పినా, మనసులో బాధగానే ఉంది—తనమీద రాజ్యంతో - ఏం చాడీలు చెప్తాడో అని. సహాయం లేకపోగా ఆలివంకవారు ఇందుకు పనికివస్తారు.

నాలుగేళ్లనుంచి అక్కౌంటెంటుగా పనిచేస్తున్న లక్ష్మీకాంతరావు సంసారాన్ని జాగ్రత్తగా, గౌరవంగా నెట్టుకొస్తున్నాడు. పొదుపువిషయానికొస్తే, భర్త ఎంత పొదుపరో భార్య అంత జాగ్రత్త కలది. అట్లా అని వాళ్లు ఖర్చులంటే వెనక్కుడుగువేసే రకముకాదు. అవసరాన్నిపట్టి, అతని పరిస్థితులనుపట్టి ఎప్పటికప్పుడు ఖర్చులే వస్తున్నాయి. అయినా సిగరెట్టుముక్కన్నా పీల్చే అభ్యాసంలేదు. కాబట్టి ఏదో కొంత నిలవచేశాడు. పిత్రార్జితం ఏమీలేకుండా సంసారం గడుపుకుంటూ నిలవలో పడ్డాడంటే యీకాలంలో చెప్పుకోతగ్గ విషయమే అంటారు ఇరుగు పొరుగు. ఆ నిలవ కావటమే ఈమధ్య భార్యాభర్తలలో కొంత అశాంతిని పుట్టించింది.

ఏమిటంటే అసలుసంగతి—లక్ష్మీకాంతము మొదట్నుంచీ ఏదో ఒక ఉద్దేశము మనసులో పెట్టుకునే జాగ్రత్తగా డబ్బువాడుకునేవాడు. కొంత నిలవకాగానే ఆ ఊహను అమలుపరచాలని దృఢపరచుకున్నాడు. అప్పుడప్పుడు స్నేహితులతో 1940 సం॥ తాను రేడియో ఒకటి, చిన్న కారు ఒకటి కొంటానని చెప్తూవచ్చాడు. ఆ మాటలు మెల్లగా రాజ్యంచెవిన పడ్డాయి. అదివరకు మాటమాత్రమయినా తనతో చెప్పని భర్త, అందరితో చెప్పటమే మొదలు ఇద్దరికి.

ఒకరోజున భర్తకు మజ్జిగ వడ్డిస్తూ, మన పక్కసందు కవతలి వీధిలోని రెండవయిల్లు వేలము వేస్తున్నారు. రెండువేలపైచిల్లరట. విన్నారా! అంది రాజ్యము. 'వెధవది తుక్కు ఇల్లు ఐఉండవచ్చు. అందుకే రెండువేలు. మాటమాటకు రిపేరు చేయవలసివస్తుంది' అని కనుబొమ్మలు ముడివేసి అన్నాడు రామారావు.

ఆ యిల్లు కొనమని భార్య అడగనూలేదు భర్త నిరాకరించనూలేదు. అంతే ఆ సంభాషణ. ఇరుగు పొరుగు విషయంగా ఆమె చెప్పింది; తగిన సమాధానము ఇచ్చాడు అతను.

దాంతోటి ముక్తసరిగా మాట్లాడుకోవటం మొదలుపెట్టారు దంపతులు. కొన్నాళ్ళకు భోజనానికి లేవమని చెప్పటానికి రాజమ్మకు, వంటయిందా కనుక్కో అని అడగటానికి లక్ష్మీకాంతానికి రామారావు అవసరమయినాడు. ప్రతివాళ్లకు కోపం రాగానే ఓ మధ్యవర్తి ఉంటే, వాళ్లతో కోపం వెళ్ళబోసుకుంటూ

ఉంటారు. సంధి రాయబారాలుకూడా పెట్టారు. చివరకు తప్పంతా మధ్యవర్తిమీదపెట్టి చివరికి వారే తప్పు కొని కులాసాగా ఉంటారు.

‘బాబుగారూ మీరు చెప్పండి కాస్త. ఏదో నాలుగుడబ్బులు నిలవ ఉన్నప్పుడే, ఇల్లు అనేది చూస్తే బాగుంటుందని నా మనసులో ఉంది. ఏదిచేసినా పిల్లలు ఎదగకముందే చూడాలి. పిల్లలు పెద్ద వాళ్ళయితే ఖర్చు లెక్కువవుతాయి చదువులని—సంధ్యలని—తరువాత మనం ఏంకట్టగలము ఇల్లు? చెప్పండి. ఇప్పుడు రేడియో అని, మోటారని కూర్చుంటే ఎట్లా? వీటికేమో వాటి ఖరీదుకాకుండా నెలనెలకు ఖర్చు. ఇల్లంటే ఒకసారి కొంటే ఇంక దమ్మిడీఅయినా ఖర్చులేదు. శాశ్వతంగా పడిఉంటుంది. మీరు కాస్తచెప్పండి ఆయనకు’ అంది రాజ్యము నరసింహారావుగారితో.

నరసింహారావు లక్ష్మీకాంతానికి మేనమామ, రాజ్యానికి పినతండ్రి. ఇప్పుడు రిటైరు కావటము నుంచి ఉచితంగా బంధువులకు, ఇరుగు పొరుగువాళ్లకు న్యాయమైన సలహాలిస్తూఉంటాడు. మంచి సానుభూతి చూపిస్తాడు ప్రతివాళ్ళ విషయంలో. ఎవరికీ మనసు నొప్పించకుండా తగవు పరిష్కారం చేయాలనే ఉద్దేశంతో, ‘రాజ్యం చిక్కిపోయావెందుకూ యీమధ్య’ అన్నాడు.

‘ఏమిటో బాబూ’ అని తప్పించుకొంది రాజ్యము. దాంతోటి రాత్రి, పగలు రాజ్యానికి ఇంటి ధోరణి ఎక్కువయిందనీ, చాలా పట్టుదలగా ఉందనీ గ్రహించి, ‘కనుక్కుంటాలే రాజ్యం. సరేగాని పిన్ని లేవటంలేదు బొత్తిగా. వంటవాళ్ళకు ఎంతచెప్పినా సరిగా కుదరటములేదు పథ్యము. నాలుగురోజులపాటు పథ్యం పానం ఇక్కడవుండి చూద్దూ. లక్ష్మీకాంతానికి నేను కబురుచేస్తాలే. భోజనానికి వస్తాడు’ అన్నాడు యుక్తిగా.

తమలపాకులు వేసుకుంటూ ‘మామయ్యా! నాకు చాల ఇబ్బందిగా ఉంది ఆఫీసుకు వెళ్లటానికి. ఒక చిన్నకారు కొందామనుకుంటున్నా. మీ సలహా ఏమి’టని అడిగాడు లక్ష్మీకాంతం, అంతవరకు తనకారు విషయమై ఏవిధమైన రిపోర్టు పోలేదనే ఉద్దేశంతో.

‘అయితే కారు లేకపోతే ఇంకనుంచి గడవదంటావు అంతేనా’ అన్నాడు న్యాయశాస్త్రవేత్త.

‘కాదు గాని అందరికీ ఉంది, నాకే లేదు అక్కడ. అందుకని నాకు చిన్నతనంగా ఉంది. ఇంతెందుకు—నాకంటె చిన్నఉద్యోగి ఆస్టినులో ఎక్కి తిరుగుతాడు. నాలుగయిదు వందలుపెట్టి మంచి రేడియో కొన్నాడు ఈమధ్య. ఎంత బాగుందనుకొన్నారు. వాడింటికి వెళ్లితే నాకు రాను బుద్ధిపుట్టదు’ అన్నాడు.

అవునులే. నాకుమాత్రము తెలియదూ నీ అవసరం? అయినా యీ కాలపువాళ్లకు అవునన్నది కాదంటే జబ్బుచేస్తుంది. నీవూ మంచి యోచనపరుడివేగా—నా సలహాకేంగాని—అని సముదాయించాడు.

ఎటువాళ్లను అటు సర్దిచెప్పి సానుభూతి చూపిస్తూ మాట్లాడాడు గాని ఏ సలహా ఎవరికివ్వాలో ఆయనకేం పాలుపోలేదు. అన్నాళ్లు జిల్లాజడ్జి పనిచేసాడు—అన్ని కేసులు తీర్పుచెప్పాడు—అంతమందికి సలహాలిచ్చాడు—ఇప్పటికి ఆ వాడలో ఏ తగవువచ్చినా పరిష్కారంచేస్తాడు అత్తాకోడళ్ల తగవులతో సహా. అటువంటి ఆయన ఈ దంపతుల కిద్దరికీ సలహా యివ్వలేకుండా ఉన్నాడు.

తల్లిదండ్రీ పోయినప్పటినుంచి, తననే తల్లిదండ్రీగా భావించిన రాజ్యానికి భర్తమాట విని కారు కొనమంటే ఏం చిన్నబుచ్చుకొంటుందో—ఆడపిల్ల!

పోనీ ఇల్లు తీసుకోవయ్యా కారుకేం తొందర అంటే—లక్ష్మీకాంతం—అసలే కచ్చమనిషి—తనకు అనుగుణంగా సలహాయిస్తేనే తప్ప, లేకపోతే గడప అయినా తొక్కడు.

ఎవరికి ఎటు సమాధానము చెప్పకుండా గోడమీదపిల్లి వాటంగా మాట్లాడుతూ దినాలు గడుపుతున్నాడు.

ఎవరివైపు తీర్పుచెప్తాడో అని భార్యకూ ఆందోళనే—భర్తకూ ఆందోళనే. కదిలిస్తే రంగం చెడుతుందని ఓ భయం మళ్లీ యిద్దరకు. సలహా లేకుండానే సమాధానపెట్టూ, దినాలు దాటవేస్తుంటే యిద్దరికీ కష్టంగానే ఉంది.

ఎవరికయినా ఎన్నాళ్లుంటుంది ఓపిక? తన వ్యవహారాలే గాని ఇంకోటిలేదు ఆయనకు!

చివరకు విసుగెత్తి 'ఏంమామయ్యా ఊరుకున్నా'రని బొమలు ముడివేస్తూ అడిగాడు లక్ష్మీకాంతం.

'నాయనా తొందరపడితే పనులవుతాయా? నీ ఆలోచన బాగానే ఉంది. ముఖ్యంగా ఉండ వలసినదే కారు, రేడియో. అక్కడక్కడ కంపినీలలో చెప్పి ఉంచు. నేనూ చూస్తూ ఉంటాలే' అన్నాడు నరసింహారావు.

'ఆ యిల్లు మరీ యిరుకుసందులో ఉందమ్మా, ఎక్కడయినా రోడ్డుమీదగా ఉన్నస్థలముగాని, ఇల్లుగాని బేరంచేస్తు ఉంటాలే. లక్ష్మీకాంతము ఏదయినా అడావడిచేస్తే నొచ్చుకోకు. నీసంగతి నాకు తెలియదా ఏమిటీ?' అని రాజ్యాన్ని సమాధానపెట్టాడు.

ఒకటి రెండు సార్లు కంపెనీలనుంచి కార్లు తీసుకొచ్చాడు లక్ష్మీకాంతం చూపించటానికి. రోడ్డు చివరదాకా కారులో తిరిగి 'అబ్బే పదినాళ్లు ఉండదురా ఇది' అని పెదవి విరిచాడు నరసింహారావు.

తప్పకుండా మామ మెచ్చుతాడనే ఉద్దేశంతోవున్న లక్ష్మీకాంతానికి ఈమాటలు వినగానే మింగుదామన్నంత కోపం వచ్చేది మనసులో. ఒకసారి ఆయనయిచ్చిన సలహాను పాటించకపోతే యింక పలుకరించనైనా పలుకరించని స్వభావం నరసింహారావుగారిది. ఆసంగతి బాగా ఎరిగిఉన్నాడు లక్ష్మీకాంతం.

ఈవిధంగా ఏదీ పడనివ్వడని తాత్కాలికమైన కోపాలతో ఏడాది గడిపారు దంపతులు.

రాజ్యం చిన్నబుచ్చుకున్నప్పుడు లక్ష్మీకాంతం తనమాటే నెగ్గుతుందనుకొనేవాడు. లక్ష్మీకాంతం హతాశుడైనప్పుడు రాజ్యము తానే గెలుస్తాననుకునేది.

సంవత్సరాది పండుగకు దంపతుల నిద్దరిని తనయింటికి ఆహ్వానించాడు నరసింహారావు.

భోజనాలయిన తరువాత ఊరికి పడమరవైపు తోటలోకి వెళ్దాము రండని పిలుచుకొని పోయినాడు.

జర్మన్ డిజైనులో కట్టబడిన చిన్న బంగళా—చుట్టూ చిన్నతోటా—ఒకపక్క గరాజ్—అందులో టూ సీటర్ కారు—అన్నీ చూపిస్తూ తోటలో ఉన్న సిమెంటు సీట్లమీద కూచోబెట్టి మాట్లాడుతున్నాడు నరసింహారావు.

ఇంతలోకే బంగళా లోపలినుంచి రేడియోపాట!

దంపతులిద్దరు ఆనంద బాష్పాలతో నరసింహారావుగారికి ఒక్కసారే నమస్కరించారు.

---

# వాయిద్యం సరదా

శ్రీమతి నందగిరి ఇందిరాదేవి

మీనాక్షి ఇరవయిఅయిదులోపున ఉన్నది. అంత అందకత్తె కాకపోయినా సామాన్యంగా బాగానే ఉంటుంది. చిట్టిబాబు అచ్చం తల్లిపోలికే. ఆరు యేడు మధ్య వయస్సు ఉంటుంది.

మీనాక్షిభర్త నరసింహం పోలీసు అమీనుగా పనిచేస్తున్నాడు, హైద్రాబాదులోని రెసిడెన్సీ అమీను కచ్చేరిలో. మనిషి నల్లగా ఉండేవాడు. ఈడుకు మించిన లావుపాటిఒళ్లు, పెద్దపెద్ద మీసాలు, చూచి మీనాక్షి చిన్నప్పుడు అత్తవారింటికి వెళ్లమంటే పోరుపెట్టేది. మరీ ఈ నల్లటి మొద్దువేషానికితోడు ఆ ఖాకిగుడ్డల డ్రస్సులో చూచి కాపరానికి వచ్చిన కొత్తరోజుల్లో జడుసుకునేది, చీకట్లో దయ్యాన్ని చూచినదానికి మల్లే. మీనాక్షి ఎన్నడూ భర్తతో మనసిచ్చి చనువుగా మాట్లాడలేకపొయ్యేది ఆతని సింహగర్జనలకు భయపడి; నరసింహం ఇంటినీ పోలీసుస్టేషన్నీ ఒకేదృష్టితో చూసేవాడు. ఇరవయినాలుగు గంటలూ తాను అమీనే అనుకునేవాడు. మీనాక్షికి భర్త అంటే భయముతో మిళితమయిన ఒకరకపు భక్తి. భర్తకు ఏమీ లోపం కలుగకుండా అన్నివిధాల సపర్యలుచేస్తూ అన్నీ సిద్ధంగా వేళకు ఉంచటంమట్టుకే ఆ భార్య యొక్క లక్ష్యం అనుకునేది. మీనాక్షి తన భర్తను 'అయ్యవారు!' అని సంబోధించేది.

చిట్టిబాబు ఉదయించాక ఆమె తన జీవితంలో నిజమైన వెలుగు చూసింది. అయ్యవారు ఇంట్లో లేనప్పుడు చిట్టితో హాయిగా పాటలు పాడుతూ ఆడుకునేది. ఆమెకు సర్వస్వం చిట్టిబాబే. వాడికికూడా తండ్రిఅంటే సింహస్వప్నం. ఇంటిముందరి అరుగుమీద కొయ్యబొమ్మలతో, మట్టిపిడతలతో ఆడుకుంటున్నప్పుడు చేతిలో కర్ర ఆడించుకుంటూ నోట్లో చుట్టవెలిగించుకొని కిర్రు కిర్రున బూట్ల చప్పుడుతో వస్తున్న తండ్రిని దూరాన్నుంచే చూచి చిట్టిబాబు తన పిడతలను బొమ్మలను చొక్కావొళ్లో వేసుకొని ఊడిపోతోన్న చెడ్డీ యెడమచేతితో సవరించుకుంటూ వంటింట్లోకి పరుగెత్తేవాడు, వచ్చీరాని మాటలతో బెదురుగా "అమ్మా! నాన్న ఒత్తున్నారు." అని అంటూ. తండ్రి ఇంట్లో ఉన్నంతసేపూ తల్లికొంగు వదిలేవాడుకాడు చిట్టిబాబు. ఇంత అమాయికంగా అల్లరిచేయకుండా అస్తమానం తల్లికొంగు పట్టుకొని తిరుగుతున్న కొడుకును చూచి 'ఉత్తపిరికివాడు' అనుకొనేవాడు నరసింహం. మొత్తంమీద నరసింహం లేకుంటేనే ఆ యింట్లోఉన్న రెండు ప్రాణాలు స్వేచ్ఛగా ఊపిరిపీల్చుకునేవి.

మీనాక్షిని కొత్తరోజుల్లో ఎక్కడికీ వెళ్ళనిచ్చేవాడుకాడు నరశింహం. పొరుగువాళ్ళ పోరు భరించలేక శనివారం మటుకు రామమందిరంలో జరిగే భజనకు వెళ్ళనిచ్చేవాడు. పిల్లవానికి తల్లికి ఆరోజు పర్వదినం. సబ్బుపెట్టి ఉతికిన షర్టువేయబోతే "శనివారంనాటికి ఉండనియ్యమ్మా" అనేవాడు చిట్టిబాబు. మీనాక్షికూడా తనతెల్లచీరను జాగ్రత్తగా ఉతికి మడతబెట్టి వుంచుకొనేది. పనిఅంతా తొందరగా ముగించుకొని శనివారంనాడు సాయంకాలంపూట ఇంటికి తాళంవేసి రామమందిరానికి బయలుదేరేవాళ్లు తల్లీకొడుకులు. సాయంకాలంపూట కమ్మని పూలవాసనతో గాలి చల్లగా వీచేది. చక్కనిచెట్లు తోట ఉండటం మూలాన కాసేపు చల్లటిగాలి అనుభవించటానికి వచ్చేజనంతో కిటకిటలాడుతుంది రామమందిరం ప్రతిరోజూ. దేవాలయం లోపలకూడా ఎంతో ప్రశాంతమయిన వాతావరణం. దేవాలయంముందర మండపంలో అన్నీపాలరాతిబండలు. విద్యుద్దీపాలమధ్య లోపల విగ్రహాలు బంగారుసొమ్ములతో ధగధగమని మెరసిపోతుండేవి. చిట్టిబాబు

మీనాక్షి ఆ మంటపంలో విగ్రహాల కెదురుగా కూర్చుని భజనచేస్తూ తన్మయులయ్యేవారు. వెళ్లేముందు చిట్టిబాబు మీనాక్షి సాష్టాంగపడి నమస్కారంచేసేవాళ్లు. చిట్టిబాబు నమస్కారంచేశాక లేచి దేవాలయంలో ఏరుకొచ్చిన పువ్వులు చొక్కాజేబులోంచి తీసియిస్తే పూజారి దేవుడిదగ్గర ఉంచటంచూచి బ్రహ్మానంద భరితుడయ్యేవాడు. ఒకగంట రెండుగంటలు బాహ్యప్రపంచం మరచిపోయి హాయిగా గడిపి కాస్త చీకటి పడుతోండగా ఇల్లుచేరుకునేవాళ్లు తల్లీ కొడుకులు.

రామమందిరంలో అప్పుడప్పుడు ఉత్సవాలు జరగటం మామూలు. అప్పుడు త్యాగరాజ ఉత్సవం జరుగుతుందని మందిరంఅంతా అలంకరించారు. ఊరూరి ప్రజ ఊడిపడ్డది. మీనాక్షికూడా జంకుతూ పిల్లవాడు చాలా సరదాపడుతున్నాడని ఉత్సవం చూడటానికి అనుజ్ఞయిమ్మని వేడుకొన్నది భర్తను. ఏవుూళ్లో ఏం విపరీతం జరిగిందో కాని "సరే వెళ్లమన్నాడు" నరసింహం. మీనాక్షి చిట్టిబాబు ఉప్పొంగి పొయ్యారు, ఉత్సవం వారంరోజులూ వెళ్లొచ్చునుగదా అని. ఉత్సవంలో ప్రతిరోజూ పండితులయినవాళ్ల హరికథలు, సంగీత పాటకుల పాటకచ్చేరీలు జరుగుతుండేవి. మీనాక్షికి చిట్టిబాబుకు సంగీతం అంటే ప్రాణం. హార్మోనియం, ఫిడేలు, వీణ వీటన్నిటి మేళవింపుతో పాటలును మహా హాయిగా ఉండేవి. చిట్టిబాబు ప్రక్కయింట్లో చూచిన హార్మోనియంపెట్టె ఇక్కడకూడా చూచాడు. అతనిదృష్టిని చాలా ఆకర్షించింది ఈ హార్మోనియం. ప్రక్కయింట్లో వాళ్ల అమ్మాయి పాడటం తన అరుగుమీద కూచుని వినేవాడు. అతనికికూడా అట్లాటి హార్మోనియం ఉంటే బాగుండుననుకొనేవాడు. తక్కినవాయిద్యాలు ఎన్నడూ చూడలేదు కాబట్టి అవి తనకు అందనివస్తువులుగా అనుకున్నాడు కాని హార్మోనియం ఇక్కడ కూడా చూచినప్పటినుండి తనకుకూడా కావాలన్నకోరిక గట్టిపడింది. తనవేళ్లు హార్మోనియంమీదపెట్టి వాయించినట్లే ఊహించుకున్నాడు. మీనాక్షికి చిన్ననాడు హార్మోనియం నేర్పించారు తల్లి దండ్రులు. తాను అత్తవారింటికి వచ్చేటప్పుడు హార్మోనియంకూడా వెంటతెచ్చుకొంది. కాని నరసింహానికి పాటఅంటే అసలు గిట్టదు. మరీ సంసారులు పాడటంఅయితే మహాపాపం అని అతని నమ్మకం. మీనాక్షి చూస్తుండగానే ఆ పెట్టెను ఎవరికో పదిరూపాయలకు అమ్మేశాడు పాపం. చిట్టిబాబు ఉత్సవం అయ్యాక ఇంటికివెడుతో "అమ్మా మనకుకూడా ఒక హార్మోనియంఉంటే ఎంత బాగుండును!" అన్నాడు. మీనాక్షికి వెనకటి గాథ జ్ఞాపకంవచ్చి కళ్లుచెమ్మగిల్లాయి. ఒక్కనిట్టూర్పుతో "అవును చాలాబాగుంటుంది. చక్కగా పాడుకోవచ్చు" అన్నది.

మరునాడు ఇంకా కార్యక్రమం ఆరంభం కాకముందే వచ్చారు మీనాక్షి, చిట్టిబాబు. స్టేజిమీద అన్నిరకాల వాయిద్యాలు పెట్టిఉన్నాయి. ఇంకా జనం రాలేదు. చిట్టిబాబు, మీనాక్షి బల్లపీటకు దగ్గరగా కూర్చున్నారు. చిట్టిబాబుకు హార్మోనియంమీదే దృష్టి. ఒక్కమాటు వాయించాలనుకున్నాడు. నిమిషాలమీద ఆ కోరిక ప్రబలిపోయింది. అప్రయత్నంగా మెల్లిగా బల్లపీటయెక్కి వాయించాడు. "ఆ" అని శృతి వేసింది హార్మోనియం. దానిమీద ప్రక్కయింటి పిల్ల పాడుతున్న "రామ, నీ సమానమెవరు" అన్నరాగం జ్ఞాపకంవచ్చింది. హార్మోనియంమీద అలక్ష్యంగా ఆ రాగం అనుకుంటూ వేళ్లు పెట్టాడు. చక్కగా ధ్వనిచ్చింది.

మీనాక్షికూడా చిట్టిబాబు ఆనందంలో లీనమైపోయింది. "అచ్చే. అట్లాకాదురా" అంటూ ఆ కీర్తన పల్లవి చక్కగా గొంతెత్తి పాడింది. ఎన్నాళ్ల కెన్నాళ్లకు! హార్మోనియంమీద పాడగలిగింది!

తనకే హార్మోనియం ఉంటే ఎన్నో సారులు పాడుకొనేది! ఎంత హాయిగా పాడింది, హృదయంలో ఉన్న బరువుఅంతా కరగిపోయింది. హార్మోనియంలేని జీవితం దండుగజీవితం అనిపించింది. కావాలి! తప్పకుండా ఒక హార్మోనియం కావాలి! ఇన్నాళ్లు అణచిపెట్టిన కోరిక మళ్లీ మొలకెత్తింది మీనాక్షికి. ఇంతలో బల్లపీట దగ్గరకు ఎవరో వస్తుండటం గమనించి నెమ్మదిగా పెట్టె మూసివేసింది.

ఇంటికి వెళ్ళాకకూడ ఆ దృశ్యాన్ని స్మరించుకుంటూ ఆనందం పొందేవాళ్లు తల్లీకొడుకు. ఎట్లాగైనా హార్మోనియం ఒకటి కొనుక్కోవాలి అన్న దృఢనిశ్చయం చేసుకున్నారు మీనాక్షీ చిట్టిబాబూ, కాని డబ్బు? మీనాక్షిచేతికి అట్టే డబ్బురాదు యజమానులవారి దగ్గరినుండి. కూరగాయకొరకు, వంటసరకు కొరకు ఇచ్చినదానిలోనే మిగిల్చి కూడబెట్టాలి ఒక్కొక్కపయిస. అవి జమఅయ్యాక ఒక హార్మోనియం కొనుక్కోవాలి అని ప్లానువేసుకున్నారు.

చలికాలం అప్పుడే ఆరంభమయింది. మధ్యాహ్నం ఎండ అంత తీక్ష్ణంగాలేదు. నరసింహం డ్యూటీకి వెళ్లిపోయిన తరువాత పిల్లవాడికి అన్నంపెట్టి తాను తిని ఇంటికి తాళంవేసి బయలుదేరింది మీనాక్షి హార్మోనియం కొనటానికి.

మీనాక్షి చిట్టిబాబు మూసీవంతెనదాటి దుకాణాలదగ్గరకు వచ్చారు. ఓపెద్దదుకాణంలో అడుగు పెట్టారు. అక్కడ ఉన్నగుమస్తా వీళ్లనుచూచి ఏంకావాలి? అని అడిగాడు. చిట్టిబాబు తల్లిముఖం చూచాడు. మీనాక్షి జంకుతూ హార్మోనియం అన్నది. గుమస్తా ఆమెను లోపలికి తీసుకొనివెళ్లాడు. అక్కడ అన్నీవాయిద్యాలు. హార్మోనియాలను వాయించి చూసేవాళ్లు, వీణతంతులు మీటేవాళ్లు, తబలాను కొట్టి చూచేవాళ్లు, వేరువేరు తివాచీలమీద కూచున్నారు. కొనటానికి వచ్చినవాళ్లకు ఆదుకాణదారు గుమస్తాలు అడిగినవన్నీ తెచ్చిచూపిస్తున్నారు. మీనాక్షిని చిట్టిబాబును ఒకతివాచీమీద కూర్చోబెట్టి హార్మోనియం తెచ్చాడు. కొత్తపెట్టెనుచూచి మీనాక్షి "కొంత వాడిన సరకులోనుండి అగ్గువరకము ఇయ్యండి" అన్నది. గుమాస్తా "అయితే మీదికి పదండి"అని సెకండుహాండు సరకు ఉన్న మేడమీదికి తీసుకొని వెళ్లాడు. అందులో ఒకటిచూపించి దానిధర చెప్పేటప్పటికి మీనాక్షికి ప్రాణాలు దిగజారాయి. "అంతధర అయితే ఇయ్యలేము" అంటూ ఒకనిట్టూర్పుతో లేచింది. చిట్టిబాబు ముఖం కళాహీనం అయింది. గుమస్తా వచ్చిన వాళ్ళను ఊరికే పోనియ్యగూడదని ఒకటి బుల్‌బుల్‌తరంగ్ పాతది చూపెట్టాడు. "ఇది అయితే అగ్గువగా వస్తుంది. బాగా పాడుతుంది. కొత్తవాయిద్యము" అని వాయించి చూపించాడు. మీనాక్షికి చిట్టిబాబుకు ఆ వాయిద్యం కొత్తగా తోచింది.

'ఇది బాగానే ఉందమ్మా' అన్నాడు చిట్టిబాబు. 'సరే' నన్నది మీనాక్షి. గుమస్తా నాలుగు రూపాయలన్నాడు. తల్లికొడుకులు మొఖాలుచూసుకున్నారు. మీనాక్షి చిరునవ్వుతో నాలుగురూపాయిలు ఇచ్చింది.

కాగితములో కట్టి యిచ్చిన పొట్లాం చేతులో పట్టుకొని ఇద్దరూ నిమిషంలో ఇల్లు చేరుకున్నారు. తనకు వచ్చిన పాటలన్నీ వాయించింది మీనాక్షి దానిమీద. చిట్టిబాబు ఆనందానికి మేరే లేదు. తాను కూడా ప్రయత్నించాడు బుల్‌బుల్ తరంగ్ మీద. ఎంతో హాయిగా ఉన్నది!

ఇంతలో జోళ్ళచప్పుడయింది. చిట్టిబాబు అదిరిపడి "అమ్మా, నాన్నగారు!" అంటూ చిట్టిబాబు వాయిద్యాన్ని బల్లమీదపెట్టి దానిమీద బట్ట కప్పాడు. మీనాక్షి వంటింట్లోకి పరుగెత్తింది. "టీ ఏదీ" అన్నాడు నరసింహం. "తెస్తున్నాను" అన్నది మీనాక్షి. అప్పుడు పొయ్యి అంటించి చేయటం మూలాన నరసింహం డ్రస్సు విప్పి కాళ్లు చేతులు కడుగుకునేసరికి తేలేకపోయింది. ఈ ఆలస్యానికి తోడు, నరసింహం ఆరోజు రూపాయలు పోగొట్టుకున్నాడు. ఆ కోపంకూడా కలిసి వచ్చింది. చప్పున అతని దృష్టి వాయిద్యంమీద పడింది. "ఏమిటది?" అన్నాడు నరసింహం చిట్టిబాబును చూచి. చిట్టిబాబు భయంతో చేతులు నలుపుకోటం మొదలుపెట్టాడు. మీనాక్షి 'టీ' కప్పులో పోసి పొద్దున చేసిన జొన్న రొట్టె ఆవకాయ కారంవేసి పళ్లెంలో పెట్టుకొని తెచ్చింది. "మీనా! ఏమిటది?" అని గర్జించాడు మరొక మాటు. మీనాక్షి ముఖం తెల్లబడింది. పళ్లెం చాపమీద పెడుతూ "అదీ-అదీ-ఒక వాయిద్యం" అన్నది వినీ వినపడకుండా. చిట్టిబాబు తండ్రిముఖం చూచాడు. తండ్రికి ఒక్కమాటు ఆపాట వినిపిస్తే అనుగ్రహిస్తాడన్న ఉద్దేశంతో బల్లమీది వాయిద్యం తీసి వాయించాడు. నరసింహం రొట్టె తింటూ "ఇహ చాలు! వాయించటం!-ఎవరు తెచ్చారు దీన్ని?" అన్నాడు కోపంగా. మీనాక్షి దెబ్బలు తినటానికి సిద్ధంగా ఉన్న పిల్లలాగా చూస్తూ "నేనే-కొన్నాను" అన్నది ధైర్యం చిక్కబట్టుతూ.

"అట్లాగా! వాపసు ఇచ్చెయ్యి!" అన్నాడు కాన్‌స్టేబుల్సుకు ఆర్డర్సు ఇచ్చే ధ్వనితో. ఆరోజు రాత్రిఅంతా అలసిపొయ్యేదాకా ఏడ్చింది మీనాక్షి. చిట్టిబాబుకండ్లు కూడా ఎర్రగా అయ్యాయి. రాత్రి భోజనాలు అయ్యాక మీనాక్షి మెల్లిగా అతడు ఇంట్లో ఉన్నపుడు వాయించుకోమని వాయిద్యాన్ని ఉంచుకోటానికి అనుజ్ఞయివ్వమని అడిగింది. కాని తిరిగి "వాపసు ఇచ్చెయ్యి" అన్న జబాబే వచ్చింది. చిట్టిబాబు తల్లిదగ్గరే ఉండి అంతా విన్నాడు.

మరుసటి రోజు ఉదయం నరసింహం వెళ్లిపొయ్యాక చిట్టిబాబుకు పచ్చటి కోటు తొడిగింది మీనాక్షి. మళ్లీ బయలుదేరారు తల్లీ కొడుకులు ఇంటికి తాళంవేసి. ఆరోజురాత్రి వాన కురవడంచేత చలి ఎక్కువగా ఉన్నది. ఎండ అసలే రాలేదు. మీనాక్షి చిట్టిబాబులకు అన్నంకూడా సరిగా తినబుద్ధి కాలేదు. చల్లగా గాలిలో ఇద్దరు ఆ వాయిద్యాన్ని మోసుకొని వెడుతున్నారు.

అక్కడక్కడ కూర్చుంటూ మళ్లీ చారుమినారు, వాయిద్యాల దుకాణందాకా, వచ్చారు. మీనాక్షికి తిరిగి పెట్టె తీసుకొని పోవటానికి సిగ్గేసింది. ఆ గుమస్తా తన డబ్బు మళ్లీ వాపసు ఇవ్వడు. తన భర్త వాయిద్యం అక్కర లేదన్నాడని, వాపసు ఇవ్వమన్నాడని, చెప్పటం అసాధ్య మనుకొన్నది.

మళ్లీ ఒకసారి ఆ దుకాణంలోపలికి వెళ్లారు బరువుహృదయాలతో మీనాక్షి చిట్టిబాబులు. అక్కడ అంతా నిశ్శబ్దంగా ఉన్నది. గేటులోపలి తలుపు, దగ్గరపెట్టి ఉన్నది. చిట్టిబాబు మెల్లిగా తలుపుతెరిచాడు. ఎఱ్ఱగాఉబ్బిన కళ్లలోంచి దీనంగా తల్లివంక చూచాడు. మీనాక్షికి ఆవేదన అర్థమయింది. తలుపులోపలికి వెళ్లి! అక్కడి తివాచీమీద చేతిలోనిపెట్టె పెట్టేసి నెమ్మదిగా ఇవతలికి వచ్చేసింది. చిట్టిబాబు తలుపు ఎప్పటల్లే మూసివేశాడు.

గేటుఇవతలికి వచ్చి ఆరెండుప్రాణాలు త్వరలో అదృశ్యం అయ్యాయి.

---

# ★ మాయాబ్రహ్మచారి

శ్రీ విద్వాన్ కేశవపంతుల నరసింహశాస్త్రి ★

ఉ. కూరిమిగల్గఁగాఁ బ్రియునిఁ గోరక కోరక కోరినావు! దీ
క్షారతిమై పసందు సెడఁగా నలఁ దీవ్రతపంబుఁ జేసి య
య్యో! రసికాగ్రగణ్యుఁడగునో సుమబాణవిరోధి దీని స్త్రీ
వారము విన్న నెంత తలవంపులు నీ కగునో యెఱుంగుమా.

ఉ. పాములవాఁడు కూటికిఁ గపాలమునందినువాఁడు బూదిమై
బ్రామినవాఁడు భూతముల బంధుఁడు గొండల నుండువాఁ డిసీ
యేమనువాఁడ. దీనివి నెన్నేన్ హిమవంతుఁ డనంత రత్న భూ
స్వామి గుణాలవాలుఁడగుభర్తనె కోరితివో తలోదరీ!

ఉ. ఎమ్ములపేర్లు దాల్చి వసియించెడు నంట శ్మశానమందు భూ
తమ్ము మనుష్యుఁడో యెఱుకఁ దప్పిన మార్గము బట్టిపోయి భా
గ్యమ్మొకయింతఁ గానని దిగంబరుచేతఁ బడంగనుంటి స
త్యమ్ముగ నమ్ము నా పలుకు లాతఁడు నీకుఁ దగండు మానినీ!

చ. జలరుహనేత్ర దేవతలు సంద్రము ద్రచ్చెడు వేళ మేల్మి వ
స్తులఁ దనవారికిచ్చుకొని ధూర్జటికిన్ విషమిచ్చినారు, మూ
ర్ఖులకళ స్థాణుఁడై గరళపానము జేసెఁ గడంగి యక్కటా!
నలుగురిలోన గౌరవము నాస్తి వివేకము నాస్తి శూలికిన్.

గీ. విషమనేత్రుఁడు విషధారి విషధరమ్ము
లమరు దేహంబువాఁడు సూ హారుఁడనంగ
వానిపై గాలి సోఁకినన్ గాని చాలు
నతివ! నీ రూపులో సగం బరిగిపోవు.

సీ. అమరనదీప్రవాహముఁ దెచ్చిపోసినఁ దడియదు వాని పెన్జడలగుంపు
ఏనుఁగు తోల్దెచ్చి యిడినప్పటికిఁగాని దిశిమొల కొకచుట్టుఁ దిరుగకుండు

త్రిపురంబులను గాల్చి తెచ్చిపెట్టినఁగాని బూదిని వాని మైపూత దేగదు
హాలాహలము దెచ్చి యారగింపించినఁ గాదు వానికి నొక్క కబళమేని

గీ. తానమందునొ పన్నీటఁ దాల్చునొక్కొ ?
పట్టు పుట్టంబుఁ గంధంబుఁ బ్రామికొనునొ ?
షడ్రసోపేతమైన భోజనముఁ జేయు
వాఁడొ? శంభుండు నీ కీడుగాడు నెలఁత !

ఆ. గీ. ఆడదిక్కు లేదు యతని గేహంబులోఁ
గొడుకొకండు గలఁడు క్రూరమూర్తి
తండ్రి కొడుకులెట్లు దండింతురో నిన్ను
రుద్రుఁడితడు వీరభద్రుఁ డతడు.

ఉ. బోనము బోనమంచుఁ దలపుత్త్రెను జే ధరియించి వీధిలోఁ
గాననివాఁడు పాపియనఁ గట్టిన గుమ్మములెల్ల రోసి బి
చ్చానికి నేగుచుండు నిఁకఁ జానరో! నీ వొక డక్కిఁ దాల్చి తం
దానలఁ బొడఁగావలయుఁ దప్పక వెంట నిదేమి కర్మమో?

ఆ. గీ. ఉండనిల్లులేక పండమంచములేక
బిచ్చమెత్తు శివునిఁ బెండ్లియైన
నాఁడు మొదలుగాఁగ నాతి! నీ కగు సుమ్మి
కాపురంబు వల్లకాటిలోన.






## వస్త్రధారణ

శరీరమందలి సుందరావయవముల సౌందర్యము నతిశయింపజేయుటకును అనంగీకారములగు లోపములను కప్పిపుచ్చుటకును వస్త్రధారణ ముపయోగించును. హెచ్చు విలువగల వస్త్రము హెచ్చు సౌందర్య మిచ్చు ననుటకు వీలులేదు. తక్కువ ఖరీదయినను ధరించు విధానముపై సౌందర్య మాధారపడియుండును. బజారులోగల వస్త్రములన్నిటిలో ఏది యందమయినదో చూడక, ఏది తన శరీర కాంతికి సరిపడునో చూడవగును. వీలయినంతవరకు ఆచారమునకు కట్టుబడియుండి వస్త్రధారణ చేయుము., సినీమాతారల ననుకరించి విపరీతపోకడలచే ప్రజలదృష్టి నాకర్షించుటయు నందరచే హర్షింపబడదు.

వస్త్రధారణ విధానముచే ఉన్నయంద మతిశయించుటయు, కొఱత జెందుటయుకూడ గలదు. ఇది కూడ ప్రతియొక్క వ్యక్తికిగల రుచిపై నాధారపడియుండినను ఈ దిగువ నొసగబడిన సలహా చాల లాభదాయకము. చారల చీరలు ధరించుటచే పొడవైన స్త్రీలు మరింత పొడవుగ కానవత్తురు గనుక వాటిని పొట్టిగ లావుగ నుండు స్త్రీలకు విడుచుట మంచిది. అడ్డగీతలు ప్రాముఖ్యము జెందినగుడ్డ సన్నని శరీరములకు అందము దెచ్చును. నిలువు గీతలు లావుగనుండు వారికి అందమిచ్చును. సన్నని శరీరముగలవారు పలుచని వస్త్రములను ఒదులుగ ధరించినచో సౌందర్య మతిశయించును. లేతరంగులు పలుచని శరీరముగల వారికిని ముదురు రంగులు స్థూలకాయులకును అందమిచ్చును.

## సౌష్ఠవశరీరము

అవయవములన్నియును సరియయిన పరిమాణముగలిగియున్న శరీరమునందు అందము ఇమిడియుండును. పలుచనైన శరీరముగలవారు విశేషించి పరిశ్రమ చేయరాదు. శుభ్రవాయువులో తిరుగాడవలెను. బలవర్ధకమగు నాహారమును తినవలెను. స్థూలకాయులు బద్ధకస్తులుగా నుండరాదు. చెమట పట్టునట్లు పరిశ్రమ చేయవలెను. కురుచ శరీరముగలవారీ పరిశ్రమచేసినచో పొడవగుటకు వీలుకలదు. ఆరుబయటగాని, ఒక డాబామీదగాని, లేక తలుపులు బాగుగా తెరిచిన ఒక వరండాలోగాని, నిడివిగా నిలచియుండుము. రెండు చేతులను, దండలు చెవులకు తగులునట్లునూ వ్రేళ్లాకాశమును సూచించునట్లును ఎత్తుము. మడమల నెత్తి కాలి వ్రేళ్లపై నిలువుము. అక్కడనుండి వ్రేళ్లపైనే వరండా పొడుగునను పరుగెత్తునట్లు వేగముగా నడువుము.

ప్రతియొక్క అడుగునకును వెనుక కాలు ఎత్తునపుడెల్ల శరీరమును పైకి సాగునట్లు విజృంభింపజేయుము. ఇట్లు దినమునకు 10 నిముషములు చేసినచో కొద్దిరోజులలో నీ శరీరము ఎదిగినట్లు జూడగలవు.

నడుచునపుడు తలను భుజములను వాలనీయకుము. మరొకరిని అనుకరింపబోకుము. నెత్తిపై యొక వస్తువున్నదనియు అది పడిపోకుండ నడువ యత్నించుచుంటివనియు భావించి నడువుము. అందుచే కేవలము కొయ్యబారజనదు.

సౌష్ఠవశరీరమునకు ఆరోగ్యము ముఖ్యావసరము. కనుక ఆరోగ్యము చెడకుండునట్లు అతి శ్రద్ధ తీసికొనవలెను.

## శరీరకాంతి

చక్కని శరీరకాంతి కలిగియుండుటకును దానిని వృద్ధిచేయుటకును పరిశుభ్రత యత్యావసరము. చర్మమును ప్రేగులను శుభ్రముగా నుంచుకొనవలెను. చర్మమునకు హానిచేయని సబ్బుల నుపయోగించుటయు తఱచుగా సుఖవిరేచనమున కేదేని మందు పుచ్చుకొనుటయు దీనికి చేయవలసినపని. ఆరోగ్యనియమములను పాటించి జీవించుట—చల్లనిగాలి, సాత్వికాహారము, పరిశ్రమ, విశ్రాంతి తగుమయినరీతిని గైకొనినచో ప్రకాశవంతమయిన శరీరమును బొందవచ్చును. పచ్చని శరీరకాంతి లేదని లేనివారు వగజెంద నవసరములేదు. చామనచాయగ నున్నవారు కొందరు ఎఱ్ఱతోలు గలవారికంటె ఎన్నియోరెట్లు అందముగ నుండుట సర్వసామాన్యముగ మనము జూచుచునేయున్నాము.

ఆవిరిస్నానము శరీరకాంతికి తోడ్పడును. బాగుగా దుప్పటి మునుగుపెట్టుకొని ఏ మాత్రమయినను గాలి బయటికి పోకుండునట్లు చూడవలెను. ఒక కొననుండి ఆవిరిగొట్టమును మునుగులోకి పోనిచ్చి ఎంతవరకు వేడి భరించగలవో యంతవరకు ఆవిరిరానిమ్ము. ఆవిరిగొట్టము లేనిచో బాగుగా మరుగుచున్న నీటిబిందెను మునుగులోనికి జొనిపి అందు బాగుగాకాలిన యిటుకరాతిని వేయుము. నీరు మరింతమరగి ఆవిరి నిచ్చును. మునుగులో నున్నప్పుడు కండ్లు మూసుకొని యుండుము. బయటికివచ్చి సబ్బుతో వేడినీట శరీరమును రుద్ది తత్క్షణము చన్నీట స్నానముచేయుము. ఇట్లు చేయుటచే చర్మరంధ్రములను వేడియావిరి తెరచును. సబ్బు వాటిని శుభ్రపరచును. చన్నీరు వాటిని మూసి చర్మమునకు బలముచేకూర్చును. ఈ విధానము దళసరి చర్మమును పలుచనచేయును. సూర్యరశ్మిచే మొద్దుబారిన చర్మమునకు మృదుత్వము చేకూరును.

శరీరకాంతికి తోడ్పడునని పెక్కువిధముల ప్రకటింపబడు ఎన్నో సబ్బులు, క్రీములు, లోషనులు, శరీరమునకు చెడుగుదెచ్చు విషపదార్థమును కలిగియుండుట విషాదకరము. ఆరోగ్య శరీరమునకు ఔషధసేవన మెంత యనవసరమో ఆరోగ్య చర్మమునకు ఔషధ గుణములుగల సబ్బులును అంతే యవసరము. కాబట్టి పరిశుభ్రమయిన వస్తువులచే చేయబడిన సబ్బునుపయోగించుటకే ప్రయత్నింపవలెను. పాదరసము, తగరము, ఆర్సెనికు చేర్చి చేయబడిన పౌడర్లు, క్రీములు చర్మమునకు చెడుగుదెచ్చును. పచ్చని శరీరముగలవారు ఏ పవుడరునయిన యుపయోగింపవచ్చును గాని చామనచాయగలవారు తెల్లపౌడరు నుపయోగింపజనదు.

కొంతమంది ముఖములపై చమురుతేలుట మనము చూతుము. అట్టివారు ఒకగ్లాసు నీళ్లలో 10 చుక్కలు హైడ్రొజెన్ పెరాక్సైడువేసి ముఖము కడుగుకొనుటవలన లాభముగలదు. హైడ్రొజెన్

పెరాక్సైడు ప్రతి మందులషాపులోను దొరకును. ప్రతియింటను దొరకు మజ్జిగయు యిందు కుపయోగించును. మజ్జిగయందు శరీరమునకు మృదుత్వమిచ్చు శక్తికూడగలదు.

కాంతి విహీనమై బడలికజెందియున్న చర్మమునకీ క్రింది విధముగ తయారుచేయబడిన లోషను చాల గుణదాయకము. ఒకటిరెండు దోసకాయలను గింజలు చర్మము తీసి ముక్కలుగ కోయుము. ఆ ముక్కలను మెత్తగ ఆవిరియందుడుకబెట్టుము. ఉడికిన ముక్కల నొక గుడ్డలో వేసి దాని రసమొక గ్లాసులోనికి పిండుము. దానిలో నాల్గవభాగము విస్కీయున్ను, ఆరవభాగము పన్నీరున్ను కలుపుము. దీనిని బాగుగకలిపి ఒక సీసాలోపోసి ఉపయోగించుము. ఈ లోషనును ముఖముపై పోసి రుద్ది నీటిలో కడిగివేయుము. ముఖమునకు నిర్మలకాంతి చేకూరును.

కోల్డుక్రీము చర్మమునకు వన్నెదెచ్చునని ప్రకటనలు మనము పత్రికలలో నిండ జూచుచున్నాము. వానిని తయారుచేయునప్పుడు, కొన్నిటిలో చేతికింపుగా జిగురుగానుండుటకును, మంచి రంగు వాసన కలిగియుండుటకును చర్మమునకు హానిచేయు పదార్థములు కలసియుండుట గలదు. కుటుంబమున కుపయోగించురీతి నీక్రింది విధముగ కోల్డుక్రీము చేసికొననగును. ఒకఔన్సు శుభ్రమై తెల్లనగు మైనము, అర ఔన్సు స్పెర్మసిటి (Spermaceti) వీటిని రెండవున్సుల ఆలివునూనెలో ఉంచి నెమ్మదిగా నిప్పుసెగపై కరగించుము. సువాసనకై అందు 4 చుక్కలు గులాబి అత్తరుగాని మరే అత్తరుగాని వేసి చన్నీటిపాత్రలో చల్లారనిమ్ము. దానిని చక్కగా యమర్చబడిన మూతలుగల సీసాలలోనింపి యుపయోగించుము.

శీతకాలములో చలిమంటలవద్ద చాలసేపు కూర్చుండుటయు వంటచేయునపుడు తఱచు పొగలోనుండుటయు తగదు. అందువలన చర్మమునకు గల పటుత్వము నశించుటయు, త్వరలో ముడుత లేర్పడుటయు తటస్థించును. శరీరకాంతి యెంత చక్కనిదైనను ముఖకళ చక్కనిది కానిచో రాణించదు. సూక్ష్మబుద్ధి, దయ, ప్రేమ గల ముఖములు ఆకర్షణీయమై యుండును. ఈ ముఖ కళను పోషించుటకును మార్గము లేకపోలేదు. ఒకచిన్న అద్దమును చేతనిడుకొని వెలుతురు కెదురుగా నిలచి ముఖమును అద్దమునందు చూడుము. అందు నీముఖ ప్రతిబింబమును చూచి సంతసించ ప్రయత్నింపక లోపములెంచటగలవో యని వెదకుము. వాటినే విధమున సాధించవలెనో యన్వేషింపుము.

(సశేషము)

—శ్రీ అలంపురం రాజు, బి.ఏ.





యుద్ధసహాయనిధి కోసమైన ఉత్సవ వినోదసందర్భంలో విశాఖపట్టణంలోని క్వీన్ మేరీస్ గరల్స్ హైస్కూలు విద్యార్థినులు ఏర్పాటుచేసిన ఆర్కెస్ట్రా.



రాజమహేంద్రవర పారిశ్రామిక ప్రదర్శనమున స్త్రీలు నూలువడుకుట.



గాలిమీా వ్యాయామసంఘము (కత్తిసాము)
బాలికపేరు రామాబాయి.

# స్త్రీ స్వాతంత్ర్యము

శ్రీమతి తెన్నేటి వెంకటరత్నావళి, 'విశారద'

ఈ కాలములో పురుషులతో సమానహక్కులు కావలెనని ఆందోళనము ప్రబలముగా సాగుచున్నది. ఈ సమానహక్కులు అను పదమే అగాధమైనది. పూర్వపు పరిస్థితులు, పూర్వపు లోకము వేరు. ఆ కాలమునకు సరిపోవు నియమములు అపుడు నియమింపబడినవి.

అందుచే కాలము మారినకొలది కొన్ని మార్పులు సంఘములో అవసరము. స్త్రీ స్వాతంత్ర్యము అంటే స్త్రీని పశుప్రాయముగను పనికత్తెవలెను మాత్రమే చూడకుండుట మొదటి అంశము. స్త్రీ మనసును మగవారు సంకటపరచరాదు. స్త్రీలకుకూడా భావములు, వివేకము లేకపోలేదు. అట్టివే లేనియెడల ఈ సంసార చక్రమును మగవారు నడపగలరా? మగడు ఎంత అప్రయోజకుడైనను, కోపదారి అయినను, త్రాగుబోతు అవినీతిపరుడైనను భార్య సహించి సంసార భారమును నిర్వహించుచున్నది. ఈ సహనము, ఓరిమి, శాంతి మగవారికి సున్న. సంపాదించువారముగదా యని విఱ్ఱవీగుట తగనిపని. స్త్రీలుకూడా, తగిన ఆర్యోక్తముగ విద్యను చెప్పించి క్రమశిక్షణమును నేర్పించిన పురుషులను మించగలరు. ముఖ్యముగ స్త్రీలు తమభావములను వెలిబుచ్చ స్వాతంత్ర్యము అవసరము. ఆ భావములు ఆచరణయోగ్యముగ నీతిదాయకముగ నుండవలెను. ఈ హద్దులను మీరగూడదు. అంతవరకు అట్టి సాతంత్ర్యము అపేక్షణీయమే. ఆడుదిగదా యని వారిని నిరసింపరాదు. పురుషులకు తోచని ఊహలు, ఉపాయములు వారికెన్నియో తోచును. వాటివలన మగవారు బాధపడకుండ సంసార చక్రమును స్త్రీలే మోయగలరు.

సంఘ దురాచారములను పోగొట్టుటకు స్త్రీలు పాటుబడవలెను. ఈ పనికి స్త్రీలు స్వేచ్ఛగ అనగా ఉచితముగ ప్రవర్తించువరకు వారికి అవకాశము నీయవలెను. స్త్రీలు ఇట్టి పనులకు నడుములుగట్టి దిగినపుడే దేశకల్యాణ మేర్పడును. సంఘమునకు చీడపురుగై పీల్చి పిప్పిచేయుచున్న వరకట్నములను నిర్మూలించుటలో స్త్రీలు స్వతంత్రముగ వ్యవహరించవలెను. ఇందులో అనుచితము ఏమియులేదు. సంఘాభివృద్ధికి అవసరమగు విషయములందు స్త్రీలకు ఎక్కువ అవకాశమీయవలెను. గుడులకు, గోపురములకుకూడ స్త్రీలు పోవుటకు అవకాశము నీయరు. ఇది అనర్థదాయకము. గుడులకు, గోపురములకు పోవుటవలన పారమార్థికమే గాక భౌతిక విజ్ఞానముగూడ గలుగును. దీనివలన విశాలదృష్టి ఏర్పడి సంసారమునకు సౌఖ్యము చేకూరును. అపుడపుడు మనోవికాసమునకు, లోకజ్ఞానమునకు నీతిదాయకములగు నాటకములను సినీమాలను చూచుటకు అవకాశము నీయవలెను.

నాటకములలోను, సినీమాలలోను స్త్రీలు పురుషులతో నటించు స్వాతంత్ర్యము కూడదు. అది ఎప్పటికినీ వినాశకరమని వేరుగ జెప్పనక్కరలేదు. సంసారము దిద్దుకొనుటలోను, పిల్లలను పోషించుటలోనూ భర్తకు ఉపచారము చేయుటలోను, స్త్రీలు సవినయముగ ఉదారభావముతో ప్రవర్తించవలెను.

అత్యున్నత పరీక్షలయందు ఆరితేరవచ్చును. శాసనసభలను మరి ఇతరసంస్థలను అలంకరింపవచ్చును. కాని శీలమును విడువరాదు. శీలములేని స్వాతంత్ర్యము కుక్కముట్టుకున్న కుండయగును.

ఆర్యసాంప్రదాయమునకు విరుద్ధముగానట్టియు శీలమునకు భంగములేనట్టియు విద్యను ఎంతవరకైనను నేర్పించవచ్చును. చేయి చేయి పట్టుకుని స్త్రీలు పురుషులతో తిరుగుట స్వాతంత్ర్యము గానేరదు.

ఇంకొక ముఖ్యవిషయము. సంసారమున భర్త అక్రమముగ ప్రవర్తించినపుడు, త్రాగుబోతై భార్యను హింసించి, దురభిప్రాయముతో కొట్టి, తిట్టి, చీకాకుపరచినపుడు ఆ స్త్రీకర్తవ్యమేద్ది? ఇది చాల కష్టసమస్య, ఈ విషయములో భిన్నాభిప్రాయము లుండక మానదు. ప్రారబ్ధవశమున భర్త చర్మవ్యాధులకు లోనైనపుడు అతని సేవయే భార్యకు కర్తవ్యము.

కాని పైనచెప్పిన విషయములందు అట్టి భర్తలను త్యజించిన పాతివ్రత్యమునకు కళంకముగాదని విశాలభావోపేతలు గ్రహించక మానరు.

నిర్నిమిత్తముగ కర్కశహృదయులై అగ్నిసాక్షిగ పెండ్లియాడిన పడతులను భర్తలు విడిచిపెట్టినచో వారి నేమిచేయవలెను? అట్టి పురుషులు సంఘమునకు ద్రోహులుగాని వేరొండుగాదు. అట్లు విడనాడబడిన స్త్రీ గతి ఏమికావలెను? అట్టి భర్తలనెడి క్రూరవ్యాఘ్రములకు సంఘములో భయము, సిగ్గు లేకపోవచ్చును. స్త్రీకన్ననో అట్లుగాదు. ఆ స్త్రీ త్రుళ్లను వీలుపడదు, నవ్వను వీలులేదు. పువ్వు ముడుచుకొన్నను తప్పే! ఎంత వినయముగ శీలవతియై ప్రవర్తించినను అట్టి దౌర్భాగ్యపు భర్తవలన అట్టి స్త్రీకి చిత్తశాంతిని ప్రజలు అవివేకులై కలుగనీయరుగదా! కాబట్టి అట్టి స్త్రీలకు సంఘములో కట్టుబాటులకు లోనైనంతవరకు మరల ఇష్టమున్నవారికి పెండ్లిచేసుకొనుటకు అవకాశముండవలెను. ఎంత చదివినను, ఎంత భాగ్యమున్నను, శీలములేని స్త్రీగాని, పురుషుడుగాని వంద్యులుకారు. సముచితమగు సంఘనియమములకు లోనై శీలవతులై స్త్రీలు సంఘసేవలో ముందంజవేసి పురుషులకు బుద్ధి చెప్పగల్గుదురు. స్త్రీ హృదయము కోమలము, ప్రేమమయము. చేసిన, త్యాగము వారే చేయవలెను. పురుషులు గడించవచ్చును. తగిన ఇల్లాలు పారమార్థిక దృష్టిలేనిదైన వాని బ్రతుకు నిరర్థకము, దుఃఖభాజనము. మేడలు మిద్దెలున్నను, వాహనములలో దిమ్మరినను, ధనములో మునిగి తేలుచున్నను, అనుకూలవతియగు భార్య లేనపుడు ఆ భర్త జీవనము నరకప్రాయము. కడు బీదవాడైనను, ఒకప్రక్క మాడుచున్నను, సుశీలయగు భార్య యున్నచో ఆమెయె అతని పెన్నిధి. అదియే అతనికి స్వర్గము. భర్తకు తోడ్పడని స్త్రీ వ్యర్థురాలు.

భారత నారీమణులు ముగ్ధత్వమునకు పేరుపడినవారు. అట్టి మహిళలు నేడు అన్యదేశ వస్త్రధారణ మోహితులై, వెఱ్ఱి వేషధారిణులై విమర్శనకు లోనగుచున్నారు. కాబట్టి ఈ ఆక్షేపణలకు గురికాకుండ హైందవ స్త్రీ యన్న ఓ యని ఉట్టిపడుచున్నట్లు హైందవ నారీమణి గౌరవమును, పేరు ప్రతిష్ఠలను గాపాడుచు సహజ వస్త్రధారణమును గావించి భళీయనిపించుకొనవలెను. కంటికి కాటుక, నుదుట తిలకమును మానరాదు.

కాన స్వాతంత్ర్యమనునది విచ్చలవిడిగా తిరుగుటగాదు. సంఘము నుద్ధరించి పుట్టినింటికినీ, మెట్టినింటికినీ, కీర్తిని తెచ్చిన స్త్రీయే స్వతంత్రురాలు. అంతవరకే స్త్రీల స్వాతంత్ర్యము.






★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

పిన్ని ఉత్తరాలు

## సంయుక్తరాష్ట్రాలు—౧

సర్వమంగళా,

మా యింటిప్రక్క ఓ మామ్మగారుండేది జ్ఞాపకం ఉందా? నీకు రొట్టీ అదీ పెట్టేది. ఎరగవూ? ఈవేళ నేనూ, చెల్లీకూడా వాళ్లింటికి భోజనానికి వెళ్లేం. ఆవిడ ఈ మధ్యనే కాశీవెళ్లి వచ్చిందిలే. అందుకు సంతర్పణ చేసింది. కాశీవెళ్లి వచ్చినవాళ్లంతా సంతర్పణ చేస్తారు. కాశీ ఎక్కడుందో తెలుసా? గంగానది ఒడ్డున. హిందువులందరికీ గొప్ప పుణ్యక్షేత్రం, కాశీ అంటే. అక్కడికివెళ్లి, గంగలో స్నానం చేసిన వాళ్లందరికీ, పాపాలన్నీ ఒక్కమాటుగా పోతాయిట! అక్కడ విశ్వేశ్వరస్వామి దేవాలయముంది. ఆ ఊళ్లో అమ్మవారి పేరు తెలుసా? అన్నపూర్ణ. కాశీలో గుళ్లు చాలాఉన్నా యింకా ఆ నగరంలో గంగఒడ్డు చూచితీరాలి. ప్రతీచోటా మెట్లుకట్టి ఉంటాయి. ఎక్కడచూచినా జనం కిటకిటలాడుతూ ఉంటారు. ఈ మెట్లుకట్టిన చోట్లన్నీ 'ఘట్టా'లంటారు. వీటిలో హరిశ్చంద్రఘట్టం ఒకటి. హరిశ్చంద్ర మహారాజుకథ నీకు తెలుసుకదూ.

అమ్మడూ, నిరుడు మనం రామేశ్వరం అవీ వెళ్లినట్లే, ఎప్పుడో కాశీకూడా వెళ్లిరావాలి. అప్పుడే ఆ చుట్టుపట్లఉన్న పుణ్యస్థలాలూ, గొప్ప నగరాలూ చూచిరావాలి. రాముడుపుట్టిన అయోధ్యా నగరం చూడ్డానికి వెడదాం అప్పుడు. ప్రయాగనుకూడా చూడాలి. ప్రయాగ ఎక్కడఉందో తెలుసా? గంగానదీ, యమునానదీ కలిసినచోట ఉంది. యమునానది గంగకి ఒక ఉపనది. 'ఉపనది' అంటే ఓ పెద్ద నదిలోవచ్చి కలిసే ఓ చిన్ననది అన్నమాట. ప్రయాగనే ఇప్పుడు 'అలహాబాదు'అని పిలుస్తున్నారు. జవహరిలాల్ నెహ్రూ అనే ఆయన ఉండేది అలహాబాదులోనే. ఆయనను గూర్చి నువ్వు విన్నావుకాదూ? ఆయనా ఆయనతండ్రి మోతీలాల్ నెహ్రూ వీరిద్దరూకూడా కాంగ్రెస్ నాయకులలో ముఖ్యులు. కాంగ్రెస్ వాళ్లంటే నీకు తెలుసుకదూ? మా వూళ్లోవాళ్లు మీటింగులుకూడా చేసేవారు. ఖద్దరు కట్టుకోమనీ, రాట్నం మీద నూలువడకమనీ చెప్పేవారు ఆ మీటింగుల్లో. "మనదేశాన్ని మనమే పాలించుకోవాలికాని, ఎక్కడ

నుంచో వచ్చిన మీరు పాలించడమేమిటి?" అని కాంగ్రెస్‌వాళ్లు తెల్లవాళ్లతో డీకొంటున్నారు. వీళ్లందరికీ నాయకుడు గాంధీగారు. ఆయనతో సమానమైన దేశభక్తుడు జవహరిలాలు. గవర్నమెంటువాళ్లు, తమకి ఎదురు తిరుగుతున్నాడని ఈయనను ఎన్నిమాట్లో జైలులో పెట్టేరు. ఇప్పుడుకూడా నెహ్రూ ఖైదులోనే ఉంట! ఖైదులోఉన్నా ఆయనకు విచారమేలేదు. దేశంకోసం పాటుపడేవాళ్లు ఎన్ని కష్టాలకైనా ఓర్చుకొంటారు.

మనం కాశీవైపు వెడితే తప్పకుండా చూడవలసిన పట్టణం ఆగ్రా. పూర్వం మనదేశాన్ని పాలించిన అక్బరులాంటి గొప్ప నవాబులు ఈ పట్టణంలోనే ఉండేవారు. ఇక్కడ ఆ నవాబులు మంచి మంచి రాచనగళ్లు, అందమైన భవనాలూ కట్టించారు. వీటన్నింటిలోనూ 'తాజ్‌మహల్'అనే భవనం చాలా అందమైనది. ఇంత సొగసైన దివ్యభవనం మనదేశంలోనే కాదు, ప్రపంచంలో ఎక్కడాలేదు. దీన్ని చలవరాతితో కట్టేరు. చలవరాయి అంటే చాలా ఖరీదైనరాయి. గోడలూ, నేలా అన్నీ పచ్చలూ, మణులూ ఇలాంటి విలువైన రాళ్లతోనే గుచ్చెత్తి అవుపిస్తాయి. ఈ భవనం చూస్తోంటే కళ్లు మిరుమిట్లు గొలిపి 'మనం ఈ భూలోకంలోనేనా ఉంట?' అనిపిస్తుంది. ఈ తాజ్‌మహల్ కట్టడానికి—ఒకటీ, రెండూకాదు. ముప్ఫయ్యేళ్లు పట్టిందిట! మూడుకోట్ల రూపాయిలదాకా ఖర్చయిందిట! ఇంతసొమ్ము ఖర్చుచేసి ఇంతకాలం శ్రమపడి కట్టించిన దెవరంటే "షాజహాన్"అనే నవాబు. ఆయన భార్యపేరు 'ముంతాజ్' ఆమే అంటే ఆయనకు చాలా గొప్పప్రేమ. పాపం ఆమె ఆట్టేకాలం బ్రతకలేదు. ఆమెను పాతిపెట్టిన చోట, ఆమె అంటే ఉన్న ప్రేమచేత షాజహాను ఈ తాజ్‌మహలును ఆమెకు గోరీక్రింద కట్టించి, తన ప్రేమను శాశ్వతంగా నిలబెట్టుకున్నాడు.

అమ్మడూ, నేను చెప్పిన ఈ నగరాలన్నీ సంయుక్తరాష్ట్రాలలో ఉన్నాయి. గంగానది ప్రవహించే ప్రదేశం మూడు రాష్ట్రాలుగా భాగించవచ్చనీ, వంగరాష్ట్రం, బీహారురాష్ట్రం, వాటిలో రెండు భాగాలనీ ఇదివరకు చెప్పేను. మూడోభాగం, సంయుక్తరాష్ట్రాలు. దీన్నిగురించి చెప్పవలసినది ఇంకా ఉంది. మళ్లీ ఉత్తరంలో రాస్తాలే.

చెన్నపట్టణం,
1.5.41.

పిన్ని

# మంత్రియుక్తి

శ్రీ దినవహి సూర్యప్రకాశరావు

(చిన్నకథ)

అనగా అనగా ఒక ఊళ్లో ఒకరాజు ఉండేవాడు. ఆ ఊరు కావేరీనది ఒడ్డునే ఉంది. ఒకనాడు ఆరాజు ఆ నది ఒడ్డుకు మంత్రితోటి షికారు వెళ్లేడు. ఆ కావేరీనది పడమటినుంచి తూర్పుకు ప్రవహిస్తోంది. నది నీరు అలాప్రవహిస్తూ తూర్పువైపుకు పోతూన్నట్లు రాజు చూశాడు. 'తూర్పువైపు ఏదేశం ఉంది' అని మంత్రిని అడిగేడు రాజు. "తంజావూరుజిల్లా"అని జవాబిచ్చేడు మంత్రి.

'మన నది నీటివల్ల తంజావూరువాళ్లు లాభం పొందుతున్నారు. ఇది బాగాలేదు. నేడే ఏటికట్ట కట్టించి నీటిని బంధించివేశేయి'అని అన్నాడు రాజు.

రాజు అసలే పట్టి పట్టుదలగల మనిషి. అతనితో వాదించడంవల్ల ఏమీలాభం ఉండదని మంత్రికి తెలుసు. అంచేత 'సరే'అన్నాడు రాజుతో.

రెండవనాడున ఏటికట్ట కట్టడం తయారయింది. దాంతో కావేరీజలం ఆగిపోయింది ప్రవహించడం మాని. నది పూర్ణంగా నిండిపోయింది. దానిలోకి వరదవచ్చి ఆనీరు ఒడ్డునుండి పొర్లి ఊళ్లోకి ప్రవహింపసాగింది. సాయంత్రానికి ఊరంతా నీటితో నిండిపోయింది. రోడ్లమీద, ఇళ్లావాకిళ్లలోను, వంటయిళ్లల్లోను ఎక్కడచూచినా నీరే. ఎక్కడా ఎండిన నేలేలేదు. రాజు మూర్ఖత్వానికి ప్రజలంతా పరిచితులే. కాని ఆయనవద్దకువెళ్లి మొరపెట్టుకునే సాహసం వాళ్లలో ఏ ఒక్కడికీలేదు. ఆఖరుకు అందరూ మంత్రి వద్దకు వెళ్లేరు. పాపం మంత్రికూడ చాల ఆలోచనలో పడ్డాడు. చివరకు అతనికొక ఉపాయం తోచింది. 'మీరంతా యిండ్లకుపొండి. నేను దీనికి ఉపాయం చేస్తా'నని చెప్పేడు ప్రజలతో.

ఆకాలంలో గడియారంలేదు. రాజభవనందగ్గర ఒక సిపాయి ప్రతిగంటకూ గంట మ్రోగించేవాడు. దానివల్ల ప్రజలకు సమయజ్ఞానం కలుగుతూండేది. మంత్రి ఆ సిపాయిని పిలిచి 'నేటిరాత్రి గంటలు చాల త్వరత్వరగా మ్రోగించాలి'అని చెప్పేడు. సిపాయి 'చిత్తం'అని తన డ్యూటీమీద వెళ్లిపోయాడు.

సిపాయి అరగంట అరగంటకూ గంట మ్రోగించడం ఆరంభించాడు. పది, పదకొండు, పన్నెండు, మళ్లా ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆఖరుకు ఆరు మ్రోగింది. ఆరుగంటలు మ్రోగేటప్పటికి ప్రజలు తెల్లారిందనుకొని లేచారు. రాజుకూడ లేచాడు. కాని ఇదేమిటి? ఆరుగంటలు కావచ్చె. సూర్యుని జాడ ఇంకా ఎక్కడాలేదు. ఇంకా నాలుగువైపులా చీకటి వ్యాపించే ఉంది.

రాజు మంత్రిని పిలిచి—'మంత్రీ! ఆరయింది. సూర్యునిజాడ ఇంకాలేదు. ఏమిటి విశేషం?'అని అడిగేడు. "హుజూర్! తంజావూరువాళ్లు ఏదో మోసంచేసి ఉండాలి. సూర్యుడు ఎప్పుడు తూర్పునుంచి వస్తాడు. మనం తంజావూరువాళ్ల నీటిని అడ్డుపెట్టేం. బహుశా దీని పగతీర్చుకోడానికి వాళ్లు సూర్యునిపట్టి దాచేశారు. తమ హుకుం అయితే ఏటికట్ట తెగగొట్టించేస్తాను'అని అన్నాడు మంత్రి.

"ఓహో! ఇదా విషయం? అయితే త్వరగా తెగగొట్టించు'అని చెప్పేడు రాజు.

ఏటికట్ట తెగగొట్టేటప్పటికి తెల్లవారింది. సూర్యుడు వెలుపడ్డాడు. మంత్రి రాజువద్దకువచ్చి 'మహారాజ్, ఏటికట్ట తెగగొట్టించబడింది. నీటిని పొంది తంజావూరువాళ్లు సూర్యుణ్ణి విడిచివేశారు. అదిగో చూడండి తూర్పువైపునుంచి వెలువడుతూ వస్తున్నాడు'అని అన్నాడు.

రాజు మంత్రిబుద్ధికి చాల మెచ్చుకున్నాడు.

# నవ్యజంతుశాస్త్రం : బాంబుల డేగ *

"వసంత"

ఎటు చూచినా భయంకరమైన యుద్ధవార్తలతో హృదయం దద్దరిల్లిపోతూంది. పశ్చిమ దేశాల్లో లక్షలకొలది ప్రజలు బాంబులకు, మరఫిరంగులకు, శతఘ్నులకు ఆహుతై పోతున్నారు. టార్పెడోలు, మైనులు, బాంబులు ఏకాధ్వరంగా నౌకలను, రైళ్లను ఛిద్రంచేస్తున్నాయి. సముద్రయానం దుర్ఘటమయింది. ఈ రకరకాల మారణయంత్రాలు "యుద్ధం మాకొద్దో" అన్న సాధుజనులు, వయోవృద్ధులు, పసిపాపలు, అబలలు తలదాచుకోడానికైనా తావీయకుండా, ఆకాశమనక, భూమియనక, నీరనక, ఎక్కడుంటే అక్కడే తిరుగులేని దెబ్బతో దుష్టజంతువులకన్న క్రూరంగా నాశనం చేస్తున్నాయి. హద్దూ ఆపూలేకుండా పెరుగు తూన్న యుద్ధ విజ్ఞానం సృజించిన క్రొత్తజంతువు లివి. ఈ జంతువులకు ఇతరజంతువులవలె జీవం లేకపోయినా ఇవి భీభత్సంగా చెలరేగుతున్నాయి. జీవంలేని ఈ ఘాతుక జంతువులు నీతితప్పిన యుద్ధ విజ్ఞానంయొక్క గారాబు బిడ్డలుగా తయారయి పెనుప్రళయం తెచ్చిపెట్టు మహామారిగా పరిణమిస్తున్నాయి.

ఎన్నోకోట్ల యేండ్ల పూర్వం అద్భుతమైన జంతువులుండేవని భూతత్త్వజ్ఞులు చెప్తారు. నేటికి సుమారు 10 కోట్ల యేండ్లక్రితం "డిమెట్రోడాక్ గైగాస్" అను 9 అడుగుల బల్లులు, "ట్రిసెరటాప్స్ ప్రోర్సస్" అను 25 అడుగుల గేదెవంటి మృగమూ, "టెరొడాక్టైల్" అను 18 అడుగుల రెక్కలుగల కొంగవంటి పక్షులు, "డిప్లొడోకస్" అను 90 అడుగుల విచిత్రమైన మృగం, "సిటియొసారస్" అను 60 అడుగుల జలచరము : ఇవన్నీ జీవించి ఉండేవిట. ఇంకా విపరీతమైన మృగాలు, పక్షులు విధివిహితజీవనం చేసికొనేవి. కాలగమనంతో భౌతికావస్థలు మారిపోతూంటే అవి జీవించడం దుర్ఘటమైపోయింది. అంతంత పెద్ద శరీరాలతోనూ అవి కాలగర్భంలో లయంకాకతప్పిందికాదు. క్రమేణ, పెద్దజంతువులు శిలమయి పోయి, చిన్న జంతుజాతులు ప్రబలడం జీవ పరిణామానికి సామాన్యలక్షణం కాజొచ్చింది.

రాను రాను మానవుడు పుట్టి, పెరిగి, తన నిశితమేధాశక్తితో కల్పనా చాతుర్యంతో సృష్టికి ప్రతి సృష్టిచేయగల స్థాయికి వచ్చేడు. తన కసాధ్యమైన కార్యంలేదని నిబ్బరంగా చెప్పగల సామర్థ్యం సంపాదించేడు. కఱకురాతిబండలో మృదులమైన స్త్రీ స్వరూపాన్ని చెక్కగల శిల్పి అయినాడు. సంధ్యారాగ శోభవంటి ప్రకృతిలోని ఆకర్ష చిత్రమేదైనాసరే చిన్న గుడ్డమీద అద్భుతంగా రచించగల మేటి చిత్రకారుడైనాడు. ఆజన్మాంతం హృదయానికి హత్తుకొనివుండే అమరగానాన్ని ఆలాపన చేయగల రమ్యగాయకుడైనాడు. మహానదులు తరించడానికి నైకాద్భుతసేతువులు కట్టిన యంత్రజ్ఞుడైనాడు. సర్వ ప్రకృతిశక్తులను భృత్యవర్గంలోనికి చేర్చుకొన్నాడు. అంతటితో సంతృప్తి నొందక

"పక్షిలో పక్షినై, ఆకాశగామినై
చేపలో చేపనై, జలగర్భవాసినై
ఈ ఆకసమ్మెలుకోనా—ప్రభువునై
సంద్రాలు పాలింపనా?"

---

* మదరాస్ ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

అని ఉన్నత భావావేశంతో గీతమాలపించేడు. గ్రంథస్థాస్త్రైయున్న ఆ మహోగ్ర మృగాలు, జలచరాలు దిగదుడుపుకైన పనికిరానట్టి యంత్రాలను ప్రతిసృష్టిచేసాడు. కాని, సామ్రాజ్యకాంక్షకి, జాతిమత వైషమ్యానికి దాసులైన స్వార్థపరుల చేతిలోబడి జనవినాశానికీ యంత్రాలు ఉపకరిస్తున్నాయి. ఈ బాంబర్లు, టేంకులు, టార్పెడోలు భూతాలవలె జీవాన్ని, దేశాన్ని, జనాన్ని మారణహోమంచేస్తున్న పిశాచవిధానం చూస్తుంటే వాటి చరిత్ర వర్ణించడానికి 'నవ్యజంతుశాస్త్ర' మనే క్రొత్త శాస్త్రభాగం అవసరంగా కనిపిస్తూంది. అందు విమానాలు నేటిసంగ్రామంలో మహాదారుణంగా విధ్వంసంచేస్తున్నాయి. యుద్ధవైఖరిని పూర్తిగా తారుమారుచేస్తున్నాయి. ఇంద్రజిత్తుని ఘటోత్కచుని మరపించునట్లు ఆకాశం నుండి బాంబుల వాన కురిపించి విచిత్ర సంక్షయం చేస్తున్న 'బాంబులడేగ' అంటే బాంబరు విమానాన్నిగురించి క్లుప్తంగా విచారిద్దాం.

ఆకాశయానంచేయు పక్షులలో అంతరిక్షమార్గాన సాఫుగా ఎగిరేది డేగ. తీవ్రదృష్టికి కాని కనుపించని ఉన్నతప్రాంతాలలో రెక్కల పూర్తిగా చాపి, చక్కగా సంచారంచేస్తుంది. ఎంత ఎత్తున ఎగురుతున్నాసరే తన తినుబండారాన్ని యిట్టే గుర్తిస్తుంది. గుర్తించి ఒక్కఊపున వాలుగావచ్చి కనురెప్పపాటులో తన్నుకొనిపోతుంది - దాని కడ్డులేదు. సూక్ష్మదృష్టి ప్రసాదించి అమితవేగంతో నిరాఘాటంగా, గురితప్పిపోకుండా ఎరనూడ్చికొనిపోవుటే దాని చాతుర్యం. ఎరను లంకించుకొనడానికి భూతలానికి రాకతప్పదు.

ఎత్తుగా ఎగురుతున్న విమానం అచ్చు డేగవలె కనిపిస్తుంది. నిండా చాచిన రెక్కలతో, కొసలు విప్పారిన తోకతో, ముడిచిన కాళ్లవలె తోచు చక్రాలతో, ప్రొపెల్లర్ గలగలతో, అది మూడుమూర్తుల డేగ ఆకారంగానే ఉంటుంది. దానికి ఇంజనే గుండెకాయ, ప్రొపెల్లరే ఊపిరితిత్తి, వైమానికుడే మెదడు. నేడు వాడుకలోఉన్న బాంబర్ల రెక్కలు 15 నుండి 40 అడుగులవరకూ పొడవైనవి. అవి గంటకి 300 మైళ్ల వేగంగలవి. కాని, గంటకి 450 మైళ్ల వేగంగల అమెరికన్ "స్కైరాకెట్" అను నూత్న చేజర్ విమానాన్నిగురించి ఇటీవలే విన్నాం. అంటే, చెన్నపురికి సుమారు 1000 మైళ్ల దూరంలో నున్న కలకత్తా 40 గంటలలో మెయిలుబండి పోగలిగితే ఈ స్కైరాకెట్టు విమానం రెండుంపావు గంటలలోనే చేరుకొంటుంది - మద్రాసునుండి కలకత్తాకు. అవసరమైతే ఎవరెస్టు శిఖరానికి రెండింతలు ఎత్తుగా 10 మైళ్లు ఎగురుతుంది. ఇది అసలు డేగకంటె నూరు రెట్లు భయానకమైనది, నిశితమైనది, వేగవంతమైనది. క్రిందకు వాలకుండా కార్యం సాధిస్తుంది. కాని నిర్భయంగా చరించలేదు. అనుక్షణం శత్రుభయమే! అయినా బాంబరు విమానాన్నిచూస్తే పురాణయుగంలోని గండభేరుండం శతాధికబలంతో, క్రౌర్యంతో లేచివచ్చిందా అనిపిస్తుంది.

అట్టి బాంబరులో కూర్చుని రివ్వున గాలిలో అంతరిక్షాన తేలిపోతూ అగోచరంగావున్న లక్ష్యం మీద బాంబులు పడవేయడమంటే చులాగ్గా రాళ్లు రువ్వినట్లు కాదు. అంతెంత ఎత్తులనుండి లక్ష్యం స్ఫుటంగా గోచరించాలి! తదుపరి దాన్ని సూటిగా తాకేటట్లు సకాలంలో బాంబు విడవాలి! ఆ లక్ష్యం స్థిరంగావున్న దివ్యభవనం కావచ్చు, మందంగా గమించు కాల్బలం కావచ్చు, త్వరగా పారు మోటారులు కావచ్చు, మహావేగంగా సాగు విమానాలే కావచ్చు. పైగా క్రిందనుంచి తుపాకులు పేల్చి బాంబరును

నాశనం చేయడానికి శత్రువులు హమేషా ప్రయత్నిస్తూ ఉంటారు. వారి పరిశీలనాదృష్టి తప్పించుకోవాలి; వారి ఊహలు భంగమయ్యేటట్లు చరలాటలాడుతూ ఆత్మరక్షణ, పరనాశనం ఒకేకాలంలో సాధించాలి.

వైమానికునికి కావలసిన సూక్ష్మదృష్టి ప్రసాదించే యంత్రాలున్నాయి. ఒక రకమైన దుర్భిణి సహాయంతో డేగ చూపును మించిన వాడి చూపును సంపాదించిన వైమానికుడు హిమాలయాగ్రమంత ఎత్తునుండి కూడ భూతలాన్ని స్పష్టంగా చూడగలడు; లక్ష్యాన్ని గుర్తించగలడు. అయితే వాతావరణంలో ధూళి, ఆవిరి, అట్టేలేకుండా గాలి నిర్మలంగా నున్నప్పుడే యంత్రాలు కచ్చితంగా పనిచేస్తాయి. లేకుంటే దృష్టి మసకలు క్రమ్మి లక్ష్యాన్ని గుర్తించడం అతి కష్టమౌతుంది. కాబట్టి నిర్మలదృష్టి అనునిత్యమూ లభించదు.

బాంబులను నికరంగా విడుచుటకు సంకులమైన పరికరాలు కావలసివచ్చాయి. బాంబు పడవేద్దామనుకొనడం పడవేయడం ఏక ముహూర్తంలో జరగడానికి మీట నొక్కగానే వైద్యుతంగా పట్టు తప్పి క్రింద పడేటట్లు బాంబులను విమానంలో భద్రపరుస్తారు. విడిచే క్షణానికి విమానం ఒకే ఎత్తున ఒడుదుడుకు కాకుండా సాఫైన రోడ్డుమీద మోటారువలె సూటిగా సాగిపోతూ ఉండాలి. ఇట్లు సమమట్టం చేసికోడానికి వైమానికునికి అధమం ఒకనిమిషం కావాలి. ఆ నిమిషంలో బాంబరు 5, 6 మైళ్లు పోతుంది. కనుక బాంబు పడవేయడానికి గణితమెంతైనా అవసరం.

లక్ష్యంయొక్క స్థాన చలనాలు గుర్తిస్తూ ఆ వెంటనే తనయొక్క స్థానవేగం వైమానికుడు కనుగొని బాంబు వదలవలసిన నియతక్షణం రెప్పపాటులో గుణిస్తాడు. ఆ ముహూర్తం ఏమాత్రం తప్పినా గురికి బారెడేకాదు మైళ్లదూరంపోయి బాంబు వ్యర్థమౌతుంది. ఏమంటే సాగిపోతూన్న విమానంనుండి విడువబడిన బాంబు సూటిగా క్రిందికిపడదు. విమానవేగంవలన ముందుకు పోబోతుంది. భూమియొక్క ఆకర్షణంచేత నిట్ట నిలువుగా పడబోతుంది. ఈ రెండు చలనాల ఫలితంగా తుదకది గాలివానలోని చినుకువలె ఏటవాలుగా రాలుతుంది. ఎవరెస్టంత ఎత్తునుండి పోతూన్న బాంబరు ఒక్కొక్కప్పుడు లక్ష్యానికి 5, 6, మైళ్లు ముందుగానే బాంబులను పడవేయాలి! అప్పుడవి వాలుగా దిగి గురిని ఢీకొంటాయి. అంత చేసినా గాలి గట్టిగా వీచిందంటే గురి తప్పిందన్నమాటే!

సుమారు వాయువేగంతో పరువెత్తు విమానాలు వాటిని కొట్టే ఫిరంగులను తప్పించుకోడానికి 3-4 మైళ్ల ఎత్తునుండి పోవు సందర్భంలో యుద్ధనావలను, చిన్న చిన్న సేనలను బాంబు చేయడం కష్టమనుకొనేవారు. కాని "డైవ్ బాంబింగ్" అను క్రొత్తఫక్కితో అది సులభసాధ్యమైంది. ఎట్లంటే: లక్ష్యంయొక్క నెత్తిపైకి సరిగా బాంబరు పోగానే నిట్రంగా క్రిందకు దూకడం, దూకుతూ బాంబులన్నీ దబదబ పడవేయడం, తత్క్షణం ఒక్కతూపున డేగవలె పైకి లేచిపోవడం. ఇవన్నీ అతిస్వల్పకాలంలో జరిగిస్తారు. ఈవిధానంలో గల సౌకర్యమేమంటే కొట్టదలచుకొన్న లక్ష్యానికి కడు దాపుగా బాంబరు పోయి, బాంబులన్నీ ఒక్కుమ్మడి కురిపించి నిరపాయంగా లేచిపోగలుగుతుంది.

# మామిడి పూరి

మామిడిపండు గుజ్జు ఒక గిన్నెలోకి తీసుకోవలెను. గోధుమపిండి, చిటికెడు వుప్పు ఈ మామిడి రసములో పోసి బాగా కలిపి (కావలిసివస్తే కొంచెం నీళ్లు వాడవచ్చు) ముద్దగా జేసుకొని పూరీలు చేయవలెను. పూరీలు నేతిలో కాల్చి పైన పంచదార చల్లవలయును.

# గుమ్మడి పూరీలు

గోధుమపిండి తడిపి, చిటికెడు వుప్పువేసి బాగా కలుపవలెను. పెద్దగుమ్మడి గింజలు తీసివేసి గట్టిగనుండుదానిని ఉడకబెట్టి నీటిని వాడనిచ్చి 10 తులముల నేతిని ఒక గిన్నెలోవేసి కాగినతరువాత వడగట్టిన ముద్దవేసి వాసనవచ్చువరకు వేయించి, కొంచెము వడకట్టిన నీటిని పోసి, వేసిన ముద్దఎత్తు పంచదారవేసి వుడికించి దించి గోధుమపిండిలో కలిపి పూరీలుచేసి కాల్చవలెను.

# జివ్వాలు

బియ్యపుపిండి వస్త్రకాయము పట్టి దానియందు మెత్తటి పంచదార నెయ్యివేసి బాగా కలిపి పేష్టువలె అయినతరువాత గోధుమపిండి రొట్టెలుచేసి వాటిమధ్య పొరపొరకు బియ్యపుపిండితో చేసిన పాకము రాసి, నేతియందు కాల్చి పంచదార లేతపాకముబట్టి వేడివేడి పూరీలు వేసి తీసిన చాల బాగుండును.

# వుప్మా బోండాలు

ఒక గిన్నెలో నేయి అరఔన్సు పోసి దానిలో ఎండుమిరపకాయల ముక్కలు, పచ్చిమిరపకాయల ముక్కలు, జీడిపప్పులు, లవంగాలు, మసాలా ఆకు (కొంచెం), కరివేపాకు, జీలకర్ర, ఆవాలు, అల్లము వేసి వేగనిచ్చి ఒక రెండుగ్లాసులు నీరుపోసి, నాలుగు టీ స్పూన్ల వుప్పువేసి మూతవేయవలెను. ఎసరు కాగినతరువాత గ్లాసున్నర గోధుమనూకవేసి వుడికించి, నిప్పులపై మగ్గనీయవలెను. నీరంతా యిగిరిన తదుపరి కలిపి దించి నిమ్మరసము పిండవలెను. ఈ వుప్మాను వుండలుచేసుకొని, మినపపప్పు, శనగపప్పు నానబెట్టి రుబ్బి దానియందు వుప్పువేసి నీటితో పలచగాచేసి వుప్మా వుండలు దానిలో ముంచి నేతిలో వేయించి తీయవలయును.

# ఛాకలేట్ పూరి

చిక్కటి పాలను పొయ్యిమీద పెరుగులాగ అగువరకు కాచి, విసిరిన పంచదార సరిపడునంత వేసి, చిక్కగా అగువరకు కోకో పొడి వేయవలెను (బాగా కలపవలెను.) ఇప్పుడు నేయివేసి కలిపి దించుకోవలెను. గోధుమపిండితో పూరీచేసి ఈ దించిన ఛాకలేట్‌ను దళసరిగా పూసి పూరీ మడతవేయవలెను. ఇట్లే మడత మడతకు రాసి పొరల పూరీచేసి నేతిలో వేయించి పైన విసిరిన పంచదార చల్లిన బాగుండును.

—టి. విజయకుమారి.

## ఘీవరు

1 శేరు మైదాపిండి, 1 ఆళాకు వరిపిండి, 1 స్ఫూను నెయ్యి యీ మూడింటిని ఒక బేసిన్‌లోగాని, తాంబాళములోగాని వేసి, కొంచెము నీరుకలిపి, బాగా మర్దించి గరిటజారుగ వుండు మిశ్రమం చేయాలి. మూతి వెడల్పుగల పాత్రలో 1 వీశె నెయ్యిపోసి, దానికి సరిపడిన గూడుపొయ్యి అమర్చి అందుపైన పాత్రనుపెట్టి, సన్నమంట పెట్టి, పిండి మిశ్రమాన్ని చిన్న గిన్నెతో యీ కాగుచున్న నేతిలో పోయాలి. కొంచెము వేగినతరువాత, వెదురుబద్ద చివర సన్నముగా వుండులాగుచేసి, దానితో చిల్లులు పొడవాలి. బాగా వేగినపిమ్మట తీయాలి. 1 వీశె పంచదార లేతపాకము పట్టించి, పై చెప్పబడ్డదానిలో వేయాలి. 2 నిముషము లాగి తీసుకొన్నయెడల అవి తేనెతుట్టెమాదిరిగా వుండి అతిరుచ్యముగా వుండును.

## ఇమృత్తీలు

½ శేరు మైదాపిండి, 1 ఆళాకు బియ్యముపిండి, పులిపెరుగులో కలిపి బాణలిలో నెయ్యిపోసి బాగా కాగినతరువాత యిందులో చిన్నవుండలు చేసివేసి, బాగా వేగినతరువాత 1 సోలెడు పంచదార లేతపాకముపట్టి వేగిన వుండలు అందులోవేసి ½ తులము ఏలకుపొడి చల్లి 1 గంట నాననిచ్చి తీసివేయ వలయును.

## గుళ్లు హోళిగలు

½ శేరు రవ్వ, ¼ శేరు పాలు, 2 తులముల నెయ్యి, 1 స్ఫూన్ బేకింగు పొడరు గట్టిగా కలపి 1 గంటకాలము నానబెట్టి బాగా దంపి వుండలుగాజేసి 1 వుండకు 1 స్ఫూన్ పంచదార చొప్పున వాటిలో పెట్టి అవి దళసరిగా పూరీలువలె వత్తి ½ వీశె నెయ్యి బాణలిలో పోసి బాగా కాగినతర్వాత వత్తిన పూరీలు వేసి వేయించిన చుట్టలుమాదిరిగా పొంగును.

## మండిగలు:

¼ శేరు రవ్వ, సోలెడు పాలు కొంచెము పేరిననెయ్యి గట్టిగాతడిపి ఒకగంటకాలము నానబెట్టి బాగా దంపి దానిని పూరీలుగా వత్తి క్రింద ఎఱ్ఱని నిప్పులుపోసి దానిమీద ఒక దాక బోర్లించి దానిమీద వత్తిన పూరీలువేసి 5 నిమిషములు వుంచి తీసి దానిమీద నెయ్యి, పంచదార చల్లుకొని వాడుకోవలెను.

—అద్దంకి బాలాత్రిపురసుందరి.

## —బంగారుపతకం బహుమానం—

గోధుమ ధాన్యముతో చేయదగిన పలువిధములైన పదార్థములను, గత సంచికల లోని తొమ్మిది పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపినవారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తివ్రాయగూడదు.

సంపాదకుడు.



తణుకులో బాలసరస్వతీ మహిళామందిర నూతన గృహప్రవేశోత్సవసభ శ్రీమతి రాయసం రత్నమ్మగారి అధ్యక్షతక్రింద జరిగినది

# గ్రంథ సమీక్ష

## త్రిభాషాబోధినీ (ప్రథమభాగం)

సంస్కృతం, హిందీ, తెలుగు మూడు భాషలను బోధించు గ్రంథమిది. లేఖకుడు : క్షీరపురనివాసి పండిత కర్ణ వీరనాగేశ్వరరావు. క్రౌను 1/16 సైజున 78 పుటలు. వెల : 8 అణాలు.

కాశిలోని అఖిలభారత సంస్కృత పరీక్షాసమితివారిచే సంస్కృత ప్రథమపరీక్షకు అంగీకరింపబడినది. 1940 ప్రచురణం.

ఇందులోని పదములన్నీ అకారాదిగా ఏర్పరచబడియున్నవి. 19 పాఠములు ఉన్నవి. వ్యాకరణము. సంఖ్యావిషయములు కూడ చేర్పబడియున్నవి.

హిందీ, సంస్కృతములు నేర్చుకొనదలచువారికి ఉపయోగకరముగ నుండగలదు.

## వలసదేశాల సమస్య

కర్త : గద్దె లింగయ్య. యుగవాణి ప్రచురణలు నెం. 1. వెల ఒక అణా. క్రౌను 1/16 సైజున 21 పేజీలు.

పరాధీన దేశాలు, సామ్రాజ్యవాదము, సామ్రాజ్యవాదులు వలసదేశాల యెడ అవలంబించే వైఖరి, సామ్రాజ్యవాద సహాయశక్తులు, సామ్రాజ్యవాద భూస్థాపన, నాయకత్వము, నూతన ప్రపంచం అనే పేర్లతో చిన్న చిన్న విభాగాలున్నవి.

ఈ రచయిత విప్లవాన్నీ, సోషలిస్టు సమాజాన్నీ కోరుకునే వ్యక్తిగా ఉన్నాడు.

## శ్రీ సూర్యప్రభువు (సూర్యునిగూర్చి సర్వతోముఖమగు విజ్ఞానము)

గ్రంథకర్త : ఆకుండి వేంకటశాస్త్రి, భీమవరము. 1939 ప్రచురణము. క్రౌను 1/16 సైజున 33 పుటలు. వెల తెలియదు. శ్రీ రాయసం వెంకటశివుడుగారి పరిచయవాక్యములు చేర్పబడియున్నవి.

సూర్యోపాసన, సౌరమతవ్యాప్తి, సప్తాశ్వతత్త్వము, సూర్యుడు - చికిత్సకుడు అను శీర్షికలున్నవి. శ్రీ పిఠాపురం రాజకుమార్ వారికి అంకితమీయబడినది ఈ గ్రంథం.

## "అమ్మా!" (మాతృస్మరణము)

కుమారి జలగం ధనలక్ష్మి రచన. 11 పుటల చిన్ని ప్రచురణము. గ్రంథవిషయము గ్రంథనామమే తెలుపుచున్నది.

## "గుంటూరు సీమరైతు"

శ్రీ గుంటూరుసీమ రైతుసంఘంవారు ప్రకటించిన "గుంటూరు సీమరైతు" అను పత్రిక పశుపోషణమును రైతులలో పెంపొందించుటకై గీతాలతోను, బసవలు, కోడెలు, గుర్రము మొదలైన జంతువుల చిత్రాలతోను అలరారుచున్నది. ఉదారులగు శ్రీ చల్లపల్లి రాజావారు, శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు దీనికి పోషకులుగా వుండడం ఉత్సాహవంతులగు శ్రీ ఆలపాటి సూర్యనారాయణచౌదరిగారు

ఈ ప్రదర్శనాలకు చేస్తూన్న కృషి ప్రశంసనీయములు. గోపాలుని కాలములోవలె పశువులు సుఖించునట్లు చేయుటకుగాను ప్రతి జిల్లాయందును యిట్టి యుద్యమములు బయలుదేరి రైతునకు అమూల్యమైన ఈ పశు సంపదను రక్షింపగలవని ఆశించుచున్నాము.

## మాతృభారతి

ఐదవ సంపుటము. క్రౌను సైజు, పుటలు 48. హైదరాబాదు (దక్కన్) నారాయణగూడెము లోని బాలికల ఉన్నత పాఠశాల విద్యార్థినీ సంఘమువారిచే నడుపబడుచున్న దీ "మాతృభారతి" మాస పత్రిక. ఈ పత్రికా ప్రతులలోని కొన్ని రచనలు చేర్పబడి యీ సంపుటము ప్రకటింపబడినది. ఇట్టి సంపుటము లిదివరకు నాలుగు ప్రకటితమైనవట. బాలికలవగు ఈ రచనలు ఆదరణీయములు.

ఇందులో సాధారణముగా స్త్రీలకు సంబంధించిన వ్యాసములు మొత్తము 24 ఉన్నవి.

## ఛాయ (ఇతర నాటికలు)

రాయల్ 1/8 సైజు 32 పుటలు. మూడు అణాలు. ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మద్రాసుకు వ్రాసిన ప్రతులు దొరకును.

"ప్రజామిత్ర" సహాయ సంపాదకులైన ముద్దా విశ్వనాధంగారు ప్రచురించిన 'ఈ చిన్న నాటికా సంపుటిలో 'ఛాయ' 'ఘాత' 'రిక్షావాలా' 'నేనే మళ్లీ రాజునయితే' అనే నాలుగూ చేర్చబడియున్నవి.

వీటిలో, మొదటి, రెండు నాటికలూ "ఆల్ ఇండియా - రేడియో", మద్రాసు కేంద్రమునుండి బ్రాడ్‌కాస్టు కాబడినవే.

ఈ నాటికలు చిన్నవిగను తేలికగా హాయిగా చదువుకోదగినవిగను ఉన్నవి. వాడుకభాష ఉపయోగింపబడినది. సంపుటీకరణము, అచ్చు, బాగాఉన్నవి.

## హిందూ రాష్ట్రపతి వినాయక్ దామోదర్ సావర్కర్

అణా గ్రంథమాల ప్రచురణము 6. కె. రంగదాసుగారు రచించినది. 3691, తూర్పుబజారు, హైద్రాబాద్ దక్కన్, ప్రకాశకులు. 1940 ఏప్రిల్ ప్రచురణ.

క్రౌను మామూలు పుస్తకం సైజున ఉన్న 32 పుటలలో అణా ఖరీదుకు చౌకగా వీరసావర్కరు జీవితమూ సందేశమూ ఇమడ్చబడి వ్రాయబడియుండుట చాలా సౌకర్యమైన విషయము.

## శకుంతల లేక భరతమాత

కుమారి జలగం ధనలక్ష్మి రచన. క్రౌను మామూలు పుస్తకం సైజున 32 పుటలు. శుభ్రమయిన అచ్చు, పేపరు. 1940 ప్రచురణ.

కృతిభర్తయైన జలగం పెదసుబ్రహ్మణ్యము నాయుడుగారి ఫోటోయు, రచయిత్రి జలగం ధన లక్ష్మిబాల ఫోటోయు చేర్చబడియున్నవి.

26 పుటల చక్కని వచనరచనయే కాక, ధనలక్ష్మి తొలిపలుకు, కృతిసమర్పణ, పత్రికలవారూ, పండితులూ, ఆదరాభిమానముగల స్త్రీ పురుష బంధుమిత్రులూ కృతిసమర్పణ సందర్భముననూ ఈ రచనపై ధనలక్ష్మిని ప్రశంసిస్తూనూ వ్రాసిన లేఖలు, వ్యాఖ్యలు చేర్పబడియున్నవి. కృతిని స్వీకరించిన జలగం పెద సుబ్రహ్మణ్యము నాయుడుగారి ఆశీర్వచన పంచరత్నములు, మంగళానుశాసన పద్యములును అనుబంధముగా ఉన్నవి.

ఈ కుమారి ఇంకను వైదుష్యమును కలిగి గొప్ప భాషాసేవ, దేశసేవ చేయగలుగునని ఆశించుచున్నాము.

## శ్రీరామయోగి (ఆంగ్లం)

శ్రీమతి పొణకా కనకమ్మగారి రచనకు డాక్టరు సి. వి. సుబ్బారావుగారి ఇంగ్లీషు తర్జుమా.

నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెం పోస్టు అన్నారెడ్డి పాలెంలోని శ్రీరామాశ్రమంనుండి శ్రీమతి పి. కనకమ్మగారిచేతనే ప్రచురింపబడినది.

చక్కని పాలమీగడవంటి నున్నని కాగితాలపై అనేకఫోటోలతోసహా బాగా అచ్చువేయించారు. క్రౌను మామూలుసైజున 50 పేజీలు. వెల 8 అణాలు.

భక్తి జ్ఞాన వైరాగ్యములను ప్రబోధించు ఉత్తమవ్యక్తి జీవితఅనుభవముల సందేశ మిందు ఇమిడియున్నది.

## "సందేశము"

ఆంధ్రదేశమున, దివ్యజ్ఞాన సమాజముయొక్క కేంద్రస్థానము గుడివాడలో స్థాపించు సమయమున అధ్యక్షులయిన శ్రీ స్వామి శివానంద సరస్వతీ యతీంద్రులవారు హృషీకేశమునుండి పంపిన సందేశము. అనువాదకుడు: యం. కె. కౌండిన్య.

చిన్న జేబులో ఇమిడిపోవు సైజున 12 పేజీల చిన్ని ప్రచురణ.

"నిర్మలుండవు కమ్ము, ఏకాగ్రచిత్తత నొందుము, సమాధి నిష్ఠా గరిష్ఠుడవు గమ్ము, జీవన్ముక్తి నొందుము." అనే సారాంశముగలది యీ దివ్య సందేశము.

సేవించుటకై, అందరకు సుఖమునొసంగుటకై, అజ్ఞానము నశింపజేసి జీవిత పరమావధియైన కైవల్యము నొందుటకై అందరకు సాహాయ్య మొనర్చుటకే జీవించియుండుట; అను పరమాశయము ఇందు ప్రకటింపబడియున్నది.

## గోమాతృ రక్షణము

కర్త, కర్ణ వీరనాగేశ్వరరావు. చీరాల సాహిత్యోద్యానమున ప్రథమ స్తబకమట.

జేబులో యిమిడిపోవు చిన్నసైజున 16 పేజీల పద్యాలు.

## పతితపావనాష్టకమ్ (ఆంధ్రీకరణము)

జగన్నాథపండిత కృతికి దర్శనాచార్య శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరాయకవి తెనుగు నేత. చిన్నసైజున 16 పేజీలు.

## రామ రావణ మైత్రి (రామాయణము యొక్క పరోక్ష దృష్టము.)

కర్త, ఎంబార్ భాష్యాచారులు. వెల అర్ధణా. చిన్నసైజు 12 పుటలు. నాటికరూపమున గద్య పద్యాత్మకముగ నున్నది.

## శ్రీ కృష్ణుడు చూపిన మార్గము

శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు తమిళమున రచించినదానికి తెనుగు అనువాదము.

ప్రకాశకులు, న్యాపతి సుబ్బారావు పంతులుగారు, అధ్యక్షులు, హిందూసమాజము, రాజమహేంద్రవరము. 1940 మే ప్రచురణము. వెల 12 అణాలు మాత్రమే.

గీతాతత్త్వమును బాగుగా నవగాహన చేసికొని యాచరించు కర్మవీరులైన రాజాజీ గీతాసారము సామాన్యజనులకు కూడ బోధపడునట్టి గ్రంథమును అతి బుద్ధికుశలతతో రచించిరి.

దీనిని శ్రీ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఎమ్. ఎ. పిహెచ్. డి. శ్రద్ధతోను భక్తితోను సర్వజన సుబోధముగా నుండునట్లును అనువదించినారు. పండిత చిలకమర్తి లక్ష్మీనృసింహ కవిగారు దీనిని పరిచూచినారట.

భరతకథ, గీత; గీతా మహాత్మ్యము, అల్పజ్ఞానపు భ్రమ, పరతత్త్వవిచారము, విచారక్రమము, ఏల గమనింపవలెను?, శాస్త్రమును పఠించుక్రమము, ఆత్మ, కర్మవిధి, కర్మఫలము, కర్మవిధికి ఆక్షేపములు; ప్రకృతి, జీవుడు, పరమాత్మ; కర్మయోగము, కర్మయోగమే యజ్ఞము, కర్మయోగమే సన్న్యాసము, సుఖములేని త్యాగము; కర్మయోగము జీవనస్థితి; మనోసాధన, ధ్యానము, స్వభావగుణములు, అందరకును మోక్షము, నాస్తికము కూడదు, గుణవిభాగము, ప్రపత్తి, అంతయు నొకటి; అద్వైతము, కర్మయోగము; విశ్వరూపదర్శనము, తుదిపలుకు అను విషయానుక్రమణికయేగాక; గాంధి మహాత్ముడు, లోకమాన్య బాలగంగాధర తిలకు, పండిత మదన్‌మోహన మాలవ్యా, డాక్టరు ఆనీబిసెంటమ్మగార్లు భగవద్గీతపై వ్రాసిన వ్యాఖ్యల సారాంశానువాదములు, గీత - విశ్వమాత, దివ్యఫలము, ధర్మభాండారము, జీవనమార్గము, అను శీర్షికలతో అనుబంధములుగా చేర్పబడినవి. క్రౌను మామూలుసైజున 152 పేజీల గ్రంథము. గట్టి అట్టబైండు.

చాలా ఉపయోగకరమైనట్టియు, అందరు పఠించి ఆత్మాభివృద్ధి నొందవలసినట్టియు రచనమిది.

## శ్రీరామ విజయము (కల్యాణ కాండము)

కర్త, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, 1935 లోనే ముద్రితమైనది. డెమ్మీసైజున 190 పుటల గ్రంథము. వెల 1 రూపాయి.

"శ్రీ శాస్త్రిగారి రచనాశైలి మృదు మధురమై, ఘన భావవిలసితమై, నీతిబోధకమై యలరారుచున్నది."

## గీతామృతము

స్నేహలతా కవితాసంఘ పుష్పముగ శ్రీయుత వాజిపేయయాజుల రామ సుబ్బారాయ కవిపుంగవునిచే రచియింపబడిన గీతామృతమను చిన్ని పుస్తకమును జదువునవకాశము నాకు లభించినది. శ్రీకృష్ణభగవానునిచే భారత యుద్ధకాలమందు కర్తవ్య పరాయణ విముఖుడై, విషాదాక్రాంత చిత్తుండైన వీరుండగు కిరీటికి సకలమానవోపయోగముగ, భవిష్యజ్జనులకును పదేశింపబడిన యీ గీతల ప్రాముఖ్యమునుగూర్చి వర్ణింపనేరితరముగాని అయిన సంస్కృతమందు పండితజనైకవేద్యమగు నా గీతామృతమును, జనసామాన్యమునకు గూడ తెలియునట్లు, తేటతెలుగున పద్యరూపమున వ్రాయుటయేగాక, ధర్మములన్నియు క్రోడీకరించి మిక్కిలి తేలికయైన భావలలో నుపయోగించుట మెచ్చదగియున్నది. ఈ గ్రంథము మిక్కిలి ప్రసిద్ధమై, ప్రజాసామాన్యమున వ్యాప్తి నొందుగాక. ఇట్టి గ్రంథములింక రచియించుశక్తి సుబ్బారాయుడుగారికి భగవానుడు ప్రసాదించుగాక.

—కవితా విశారద అట్లూరి వేంకట సీతమ్మ.




## హిందూస్త్రీల వారసత్వ చట్టము—ఫెడరల్‌కోర్టు తీర్పు

"ఆస్తి విషయంలో స్త్రీలకు ఇంకా మంచి హక్కులు ఇచ్చునట్లు హిందూ న్యాయశాస్త్రమును సవరించుట అవసరము కాబట్టి" యను ప్రయోజనము ఉద్దేశముతో, 1937వ సంవత్సరములో హిందూస్త్రీల వారసత్వ ఆస్తిహక్కుల చట్టమొకటి కేంద్ర శాసనసభవారిచే శాసింపబడెను. దానికి ఒక సవరణచట్టము 1938 సంవత్సరములో శాసింపబడెను. 1937వ సంవత్సరం ఏప్రిలు 1వ తేదీకి క్రొత్త ఇండియా రాజ్యాంగ చట్టము అమలులోనికి వచ్చెను. ఈ చట్టము ప్రకారము వ్యవసాయభూములకు సంబంధించిన చట్టములను శాసించే అధికారము రాష్ట్రీయ ప్రభుత్వముల కొసంగబడెను. అట్టి చట్టములను శాసించుటకు క్రొత్త రాజ్యాంగచట్టము ప్రకారము కేంద్రశాసనసభలకు అధికారములేదు. అట్లయినను ఇండియా రాజ్యాంగ చట్టము అమలులోనికివచ్చిన అనంతరమే హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టము అనునది ఢిల్లీ శాసనసభవారి చేతనే శాసింపబడెను. గవర్నరు జనరలుకూడ ఆ చట్టమునకు అనుమతించి సంతకముచేసిరి.

హిందూస్త్రీలకు వారసత్వమువల్లగాని, సంక్రమించుటవల్లగాని, వ్యవసాయ భూములకు సంబంధించిన హక్కులుకొన్ని ఈ చట్టమువల్ల ఏర్పడుచున్నవి. వ్యవసాయ భూములు మాత్రమేగాక తదితరములైన ఆస్తులకుకూడా హక్కులుకొన్ని ఈ చట్టము ననుసరించి స్త్రీలకు సంక్రమించవచ్చును. వ్యవసాయ సంబంధమైన ఆస్తి హక్కులతోగూడిన ఈ చట్టము క్రొత్త ఇండియా రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చిన పిమ్మట ఢిల్లీ శాసనసభవారిచే శాసింపబడుట సక్రమమా అక్రమమా? అందువల్ల ఈ చట్టము చెల్లదగునది అగునా కాదా అను విషయమై న్యాయ నిర్ణయము చేయవలసినదని ఫెడరల్ కోర్టువారిని గవర్నరు జనరలు కోరియుండెను.

ఫెడరల్ కోర్టువారు ఏకగ్రీవముగ చెప్పిన తీర్పు సారాంశమేమంటే :

గవర్నర్లకు చెందిన రాష్ట్రీయప్రభుత్వములలోని వ్యవసాయ భూములకు సంబంధించిన పారంపర్య హక్కులను గూర్చి శాసించుటకు ఈ చట్టము వర్తింపనేరదు. చెల్లనేరదు. వ్యవసాయములు కాక తదితరములైన ఆస్తుల విషయములో ఏర్పడు వారసత్వపు హక్కులను శాసించుటకు మాత్రము ఈ చట్టము వర్తించును. కనుక వ్యవసాయ భూములకు సంబంధించినంతవరకు ఈ స్త్రీల వారసత్వపు హక్కుల చట్టము చెల్లనేరదు. తదితరములైన ఆస్తివారసత్వములకు సంబంధించినంతవరకు ఈ చట్టము చెల్లదగును.

అనగా, సమష్టి హిందూ కుటుంబములో ఒక పురుషుడు చనిపోయినప్పుడు వితంతువైన స్త్రీకి ఆయన ఆస్తిలోని వ్యవసాయ భూములమీద తప్ప యితరమైన అన్ని ఆస్తుల విషయంలోను వారసత్వపు హక్కు కలుగుచున్నదని ఈ తీర్పు సారాంశముగా మనము గ్రహింపవచ్చునని తోచును.

క్రొత్త ఇండియా రాజ్యాంగ చట్టము అమలులోనికి వచ్చిన తేదీ-కేంద్ర రాష్ట్రీయశాసనసభల అధికారాలు గూర్చిన న్యాయశాస్త్ర సంబంధమైన వాదాల చిక్కులు విడదీసి, వ్యవసాయ-భూములుతప్ప తక్కిన ఆస్తుల విషయంలోనైనా హిందూస్త్రీల ఆస్తిహక్కు సంబంధంలో చేయబడిన చట్టాలు శాసనాలుగా అమలు జరగడానికి అభ్యంతరములేదని తీర్పు చెప్పిన ఫెడరల్ కోర్టువారు వంద్యులే.

అయినా ఇంకను ఇతోధికముగా హిందూ స్త్రీలకు విశాలతరమగు ఆస్తి హక్కులు కలుగజేయవలసి యున్నదని దేశమంతటా ఆందోళనచేసి సాధింపవలసిన యవసరమున్నది.

క్రొత్త ఇండియా రాజ్యాంగ చట్టము-శాసనసభల అధికారములకు లోబడియే, వీలయినంతవరకు హెచ్చు సదుపాయములు సౌకర్యములు హక్కులు హిందూస్త్రీల ఆస్తి విషయంలో కలుగవలసియే యున్నదని మా కోరిక.

## సింధులో వరకట్నములకు పరిమితి నిర్ణయము

వరకట్నములు 25 రూపాయలకు మించరాదనే చట్టమొకటి సింధురాష్ట్రీయ శాసనసభలో ఈ మధ్యనే ప్యాసయినదట. వరకట్నములే తప్పనిసరి యైనపుడు ఈ విధముగా అల్పపరిమితి నిర్ణయం జరగడము కొంత సౌకర్యమే కావచ్చును, ఒకవిధమైన సంస్కరణమే కాగలదు. గాని అసలు వరకట్నపు పట్టింపు దురాచారమే పోవడము మేలు కాదా ?

## విశ్వకవి దివ్యవాణి

విశ్వకవి, ఋషి, ద్రష్ట యగు శ్రీ రవీంద్రనాధఠాకూరు ఈమధ్య తమ 80వ జన్మదినోత్సవము నాడు శాంతినికేతనమునుండి యిచ్చిన సందేశము మానవాత్మకు, ముఖ్యముగ భారతీయ హృదయమునకు ఆశను ఉత్తేజమును కలిగించినది. పాశ్చాత్యనాగరికతా వస్తు సంపత్తి విజ్ఞానములయొక్క నిష్ఫలతకు వగచిన విశ్వకవి, మానవాత్మ ఉన్నతి ఉద్ధరణలయందు పరమ విశ్వాసమును, తూర్పున నవోదయము కలుగగలదను ఆశా సందేశమును జీవంతమగు వాక్యాలలో ప్రకటించి ఆర్యసభ్యతా గౌరవమును నిలువబెట్టెను.

"నాగరికత అనునది, సంస్కారము అనునది ఐరోపాఖండమునం దుద్భవించునని తలంచితిని. కాని యూరపుపై నాకు గల విశ్వాసమంతయు భగ్నమైనది. భారతదేశములోనే మానవకోటి నుద్ధరించు మహనీయుడు పుట్టగలడని నాకు ఆశ కలుగుచున్నది. పాశ్చాత్య నాగరికతయంతయును వ్యర్థమైన పెంటపోగువలె నున్నది. ఈ మహాప్రళయానంతరము త్యాగస్వరూపులైనవారు తిరిగి అవతరించి మానవకల్మషమును కడిగివేయగలరు. అట్టి జ్ఞానభాస్కరుడు ఈ ప్రాచ్యదిశనే ఉదయించగలడు" అని శ్రీ రవీంద్రుడు పలికెను.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.